శ్రీరస్తు.

# రుక్మిణీపరిణయము.

కూచిమంచి - తిమ్మకవి ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1923

తే. వేమహాదేవికలుష నయ్యొగుపుంభోండి, గమలజానికల్లి నతజనకల్పవల్లి
యిందిరాసుందరాంగి మన్మందిరమున, నిండువేడుక ననిశంబు నిలుచుఁగాత. 5

ఉ. ఫాలతలంబునందుఁ గరపద్మయుగంబు ఘటించి మ్రొక్కెదం
బాలితసిద్ధకిన్నరసనాకచరామరసాళికి న్దయా
శాలికి భారతీవదనసారసభాసురభానుమాలికిన్
క్షాళితదోషపాళికి జగన్నుతశీలికిఁ దమ్మిమాలికిన్. 6

సీ. చంపకోత్పలమహాస్రగ్ధరసుస్వరమణిమాలికాభ్రాజితమనోష్ణ
మత్తకోకిలవాణి మానితవిచికిలస్తబకకర్ణవిభాగితలమహార
సరసేందువదన బంధురకాంతిసంయుక్త సరసిజనయన సుందరవరాంగి
నిత్యవిభూతిమానిని రుచిరోత్సాహ ప్రాద్యభేదాఖండపరమశక్తి
తే. యతినుతశ్లోకఛందోమయప్రకాశ, యనఘజనవరతగణామితానుమోద
యైనవాగ్దేవి నాదుజిహ్వాగ్రమునను, నిలిచి సత్కావ్యకరుణ నెఱపుఁగాత 7

చ. అనుదినమున్ మదిం జలన మానక మానక పూని దీనులన్
మనుచుచుఁ గావ్యవేళల నమాఘవ మాఘవముఖ్య లౌసురల్
దను వినుతింప మేలిడుచుఁ దానగు దానగుణాఢ్యుఁ డంచు నిం
పెనయఁగఁ గోరి మ్రొక్కెదను నే నిఁక నేనికమోముసామికిన్. 8

ఉ. పాయనిభక్తితోడ మదిఁ బ్రస్తుతిసేసెద దీనరక్షణో
పాయుని యోగమార్గనిరపాయుని సంతతరామకార్యధౌ
రేయుని దివ్యకాయుని వరిష్ఠవిధేయుని శిక్షితోగ్రదై
తేయుని నప్రమేయుని సుధీజనగేయుని నాంజనేయునిన్. 9

క. వితతాగమశరణుండై, ప్రతిదినసామపదచయవిభాసితుఁడై ది
వ్యతరవిరాడ్విగ్రహుఁడై, ధృతిఁ గేరు నజేయుఁ డైనతేయున్ గొలుతున్. 10

క. తవిలి నవప్రభ లెసఁగఁగ, భువిఁ గేరెడుమిత్రజాతబుధగురుభాస్వ
త్కవిమాహేయకలానిధి, కువలయచక్రాభినందనుఁ బ్రణుతింతున్. 11

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనామాత్యుఁడే భవ్యతాత
నిరతాన్నదానవర్ణితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగనమంత్రియును నరసన్నయు నేమంత్రి యనుఁగుఁదమ్ము
లరఁ దిమ్మకవిరాజన్న జగ్గనయును సూరన యెవ్వనిసుతవరేణ్యు
తే. లా నరసమ్మ పాపమే ఘనసనిమాజ, తిమ్మక్రాంతాక్షి యే చతురరాశి-
యట్టి శ్రీకూచిమంచివంశాబ్ధిచంద్రు, మజ్జనకు నలగంగనామాత్యుఁ దలఁతు. 12

క. క్షితి నతిచతురతల నవా, రితసజ్జనహితము లైన రామాయణభా
రతములు లోనర్చినజగిద, ప్రతిమునివాల్మీకివ్యాసపాత్రుల నెంతున్. 13

ఉ. ఆరయ సంస్కృతాంధ్రరచనాంచితకావ్యధురీణులై భువిన్
భూరియశంబుఁ గైకొనినపుణ్యుల నామది సన్నుతించెదన్
భారవికాళిదాసశివభద్రుల భోజనృపాలబాణులన్
జోరమయూరమాఘులను సుప్రథితౌఘభవభూతిముఖ్యులన్. 14

చ. స్థిరమతి నన్నయార్యునిఁ దిక్కన నెఱ్ఱన భీమనాఖ్య భా
స్కరు నమరేశుఁ బోతకవిచంద్రుని సోముని శంభుదాసునిన్
నిరతముఁ బ్రస్తుతింతు నవని న్మహితాంధ్రకవిత్వవైభవ
స్ఫురణఁ బ్రసిద్ధులైనకవిముఖ్యుల భూప్రసన్ననామాఖ్యులన్. 15

క. సారము గలచో నలరుచు, నేరము గలచోటు మిగుల నిందింపక స
త్కారుణ్యంబునఁ గనుఁగొను, సూరికవీంద్రుల నుతింతు సురుచిరకీర్తిన్. 16

ఉ. శంక యొకింతలేక కవిసంఘముఁ జూచి వృథా వివాదముల్
బింకముతోడఁ జేయుచును బెద్ద మంచును బద్యమెల్లఁ గు
శ్శంకలు సేయుచున్ గవితసార మెఱుంగక సారెసారెకున్
వంకలువేయుదుష్కవిగణంబుల నెల్లఁ దృణీకరించెదన్. 17

వ. అని నిఖిలదేవతాప్రార్థనంబును, గురుచరణస్మరణంబును, పురాతన నూతన మహా
కవి వర్ణనంబును, కుకవి నిరాకరణంబును గావించి, మఱియు నిష్టదేవతాప్రార్థ
నంబు చేసెద. 18

సీ. చిన్నిచెన్నెలఱేఁడు చెన్నైనసికపువ్వు పసమించుపులితోలుపట్టుసాలు
చిలువలరేకిమీఁదుబలుమానికపుఁదాళివాలంపుఁజెలిగిబ్బవాహనంబు
గతికిపూజలమెచ్చుగారాబుకొమరుండువలిగొండకూఁతునువలపుటింతి
జేజేతుటుములెల్లఁ జేరి కొల్చెడుబంట్లును వెండిగుబ్బలియునికిపట్టు
తే. నగుచుఁ జెలువొందు భువనంబు లనుదినంబు, రమణఁ బాలించునిన్ను నేఁ బ్రస్తుతింతు
బుధనుతవిలాస పీఠికాపురనివాస, కుముదహితకోటిసంకాశ కుక్కుటేశ. 19

సీ. బృందారకామందమందారవీతాఘబృందారవిందాక్షునందనేయ
పాటీరవన్ద్రేందుకోటీరగౌరీవఘాటీరతాదిత్యకోటితేజ
క్షోణీరథాంభోధితూణీరగంగాప్రవేణీరవామోదపాణిహరిణ
నీహారవాగ్భామినీహారహారానిలాహారవర్యాక్షవాహనాప్త
తే. శర్వసర్వజ్ఞదుర్వహాఖర్వగర్వ, సర్వపూర్వామరోదగ్రశర్వరహర
సారసుకుమారసంతతోదారవీర, చారుతరకుక్కుటాకారజయసుధీర. 20

క. చిరతరముగ నానేర్చిన, కరణిన్ రచియించి నీకుఁ గావ్య మొసఁగెదన్
సరసునవోసుమదెల్లను, బరిమారి యొనర్చి దయను బాలింపు శివా. 21

క. అని విన్నవించి కావ్యం, బొనరింపఁగఁ బూని మొదల నుద్యద్గతి దే

వ్రన కిఁ బగు పీఠికాపురి, ఘనతర మగు మహిమ మెన్నఁగా నలరారు నొగిన్. 22

సీ. పాదగయాక్షేత్ర పరమపవిత్రంబు పురుహూతికాంబకుఁ బుట్టినిల్లు
యేలానదీజలాప్లావితతటాకానేక ముఖిలశక్తులకు విహారభూమి
తోరంపుఁ బనసపాకోనిధితంబు నిర్మలగౌతమీనికటసీమ
కుంతిమాధవదేవు సుస్థానంబు విలసితభీమమండలితంబు
తే. సేతుకాశీప్రయాగాద్యశేషదివ్య, తీర్థరాజంబులందుఁ బ్రతిష్ఠఁ గాంచి
సకలదోషాపనోదకశక్తి నలరు, పుణ్యస్థానంబు పీఠికాపురవరంబు. 23

సీ. వక్రవాతాహార్యజలధితుల్యోన్నత ప్రాకారపరిఖా విరాజితంబు
సాంద్రముక్తాసౌధచంద్రశాలానేకకల్పనిర్మితహర్మ్యగోపురదంబు
కరిసైంధవాందోళికాధేనుధనధాన్యవనదేవగృహసరోవర్ణితంబు
విమలచాతుర్వర్ణ్యవిద్వత్కవిశ్రేష్ఠవిటనటామాత్యవిస్ఫారితంబు
తే. రాజమహేంద్రవరదుర్గరాజ్యభూరి, ఘోరసంఘటనాక్రాంతభాసమాన
రావుమాధవనృపరక్షితంబు, భోగనికరంబు పీఠికాపురవరంబు. 24

## షష్ఠ్యంతములు.

క. పతితప్రణేతకు ఘన, దాతకు రోషప్రశమితధాతకు భువన
త్రాతకు సకలాగమవి, జ్ఞాతకు శీతాచలేంద్రజామాతకొగిన్. 25

క. ఖండనపరఖండనకర, మండనకరచాపఖడ్గమహాసియున కా
ఖండలమణికుండలఘృణి, మండలఫణిరాజరాజమానాంగునకున్. 26

క. కమలాధిపసఖునకు స్మృత, కమలహనకు మునినుతాంఘ్రికమలంబునకు లస
త్కమలధరాణీశునకును, గిరిశిరోజునకు సముద్ధకమలహాసునకున్. 27

క. నాదవదాపాదదశా, శారదశశిహాసికరతుషారాహిర్యుక్
తారాహితశీతాప్ర్యత, ఘారామిలసితవిలాసదరహాసునకున్. 28

క. వృషవర్ధనునకుఁ గిన్నర, వృషసఖునకు రిపుమదేభవిద్రుతముఖునకున్
వృషసేవితచరణునకును, వృషవాహనజనకునకును వృషవాహునకున్. 29

క. హరిమణినిభకంఠునకు, హరిమదమథనునకు నిశితహరిబాణునకున్
హరివరకేయూరునకును, హరికోటిసమానకాంతిహరిణాంగునకున్. 30

క. సంగరజయునకుఁ గుక్కుట, లింగస్వామికి నవీనలీలావిలస
న్మంగళకటినటనరతునకు, గంగాజూటునకు దివిజగణసేవ్యునకున్. 31

వ. అనంతసాష్టాంగదండప్రణామంబులు సమర్పించి భక్తిప్రపత్తియుక్తుండనై నస్మత్కృత
కావ్యమునకు నంకితంబుగా నాచియింపఁబూనిన రుక్మిణీపరిణయంబను మహా
కావ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 32

క. శూద్రులు గల పురుషగుణస, ముద్రులు సలిలస్వధైర్యమోఘీకృతహే
మాద్రులు ఘోరరణాంగణ, రుద్రులునం బోలి మహిఁ బెరుచి నవ్వీటన్. 51

సీ. తమగానములకు సంతసిలి పన్నగములుఁ బ్రస్ఫుటభోగసంభ్రమతి నలరఁ
దమవిహారములకుఁ గేతయము భూజనుల్ చొక్కి సుమనోవికాసవిస్ఫూర్తిఁ దనరఁ
దమముఖాంభోజగంధములకు సరసాళు లుప్పొంగి మదబుద్ధిఁ గప్పుకొనఁగఁ
దమమణినూపురధ్వనులకుఁ బరమహంసలు సోలి మానసాసక్తి నలుమఁ

తే. గేరి నగ మీఱి బలుతూఁపు లేచి నాతి, తూలి యడి నేయుకొంబులలైరిఁ బొరిఁ
గూరి వేనారి తముఁగోరి వేయివిటులు, చతురులఁ దేలింతు రావారసుదతులందు. 52

ఉ. తమ్ములు నొల్లలం బోగలంబాసవముల్ విరిపొన్నలన్ శికి
మ్మలు హల్లకంబులను జంపకజాలము లిప్పనొగ్గులన్
సమ్మతి నమ్మఁ జూపి తమచాతురిరాజ్యముదృష్టిలప్రకా
శ మ్మెఱఁగింతు రెంతయును జాలి కపుర్వరిఁ బుష్పలావికల్. 53

సీ. చెలిమిఁ గైకొనియెదఁ జెండ్లిమ్ము చెలియన్నఁ గొనుమారు చేమముల్ కొసఁగ కిపుడు
పొడలెడుచిప్పను సూపెద విది ముద్దియ మేలనఁ బలుగెంపులోఁ బనింపు
సుమకిలంబ క్రీడ నమరింపుసఖి యన్న నది నీవి వదలింప కనువుగాద
యెల్ల వేళల నుండుమ్ము కెల్గా వేడ్క నవఁగ మూపురములోఁ గొనియనిచెద

తే. ననుచుఁ దముఁ జేరి కేలెడు ననుపుకాంత్రఁ, గనుచు నెఱదంటపలుకులు వినుచు మదినిఁ
జెనుచు మదమున ననలమ్ము కొనుచు మనుచుఁ, బుష్పలావికలందు రసప్రదమునందు. 54

సీ. కుచము జూడకు చంబు లిచ్చానయన నివి కొనఁగోర నొక్కింతి గొనబొనప్పు
నంటిఫలంబు గైకొంట నీయెడఁ దగు నన నటకానిమ్ము వెనుకనిమ్ము
నెలఁతి మాకందంబు నిగ్గోరుట లనఁగఁ బలుమాఱు కేలికి నలరియుండు
మోవిపంటను గంటిఁ గావించి చూతునా యనఁ బండుఁ గని యిటు లాడనగునె

తే. యనుచు ఫలములఁ గొనఁ బూనిన విటులు నిటులు, నొనసిసరసోక్తులాడుచు నెనసి తిరుగ
విటులకింపుగ మఱుమాట వెసనొసఁగుచుఁ, ఫలముల మ్మెడిచెలులందు చెలిమినందు.

క. ఆనగర మేలు మేలుగ, మానితకీర్తిప్రతాపమహిమోన్నతిచేఁ
బూనిక మీఱఁగ భీష్మక, భూనాయకుఁ డెప్పుడు సకలబుధజననుతుఁ డై. 56

సీ. కువలయంబున కార్తిఁ గూర్పనియినుఁడు చక్రాళి నేఁచక యలరురాజు
ధర్మహింసనమునఁ దనరనిరాముఁడు భోగినీసురతేచ్ఛఁ బోనివిజయుఁ
డతిరాజసమున మిన్నందనిహరుఁడు గోత్రాహితుఁడు గాని గోవిభుండు
పరమహంసలఁ బోవఁ దఱుమనిఘనుఁడు నెన్నఁడి భంగమొందనివాహినీశుఁ

తే. డనఁగఁ దేజంకమాన్యప్రవినుతిశౌర్య, జవవిభవదానగాంభీర్యశాలి యగుచుఁ
బూని తనకీర్తి జగమెల్లఁ బొగడ నెగడె, నన్నెమీఱంగ భీష్మకావనివరుండు. 57

జెన్నొందె నెఱచిన్ని చన్ను లుద్భవమయ్యె మోవి యొక్కించుక జేవురించె
నూనూఁగునూఁగారు నునుఁజాయదనమయ్యెఁ గటిచక్ర మించుక ఘనతనొందె
తే. నడల నొయ్యొయ్య మురిపంబు గడలుకొనియె, ముద్దుజిలిబిలిపలుకులు మొలచె సొలపు
చిఱుతతెలినవ్వు లంతంతఁ జెలువుమెఱసె, రమణికి నవీనయౌవనారంభమునను. 89
క. సింగార ముప్పతిల్లఁగఁ, బొంగెడు తేజమ్మనంబు పొడమినయపు డ
య్యంగజుని చేఁ జెలంగెడు, బంగరుకీల్బొమ్మ యనఁగ బాలిక యలరెన్. 90
ఉ. అంతటఁ జన్నుదోయి బటువై విలసిల్లె నితంబబింబ ము
త్యంతము విస్తరిల్లె మదనాంకురభావము పుష్పితిల్లె మో
మెంతయుఁ దేజరిల్లె సిరి లీనుచు వేనలి యుల్లసిల్లె న
క్కాంతకు నిండుజవ్వనము కన్నులపండువయై ఘటిల్లుటన్. 91
చ. నిలుకడఁ గన్న క్రొమ్మెఱుఁగు నింగిఁ దొలంగినచంద్రరేఖ యిం
పలరఁగఁ బల్కుపుష్పలత ప్రాణము లున్న పసిండిబొమ్మ చే
ష్టలు గలగుజ్జుమావి ఘనసౌరభ మబ్బినమానికం బనం
జిలుకలకొల్కి యంత విలసిల్లె మనోహరయౌవనంబునన్. 92
ఉ. ఆనవమోహనాంగి యనయంబు నయం బెనయం బుధావళుల్
దానగుణాఢ్యుఁ డైనతనతండ్రిసభం బ్రశంసిరాజ దేవకీ
సూనునిరూపయౌవనవయోబలవైభవముల్ గణింపఁ దాఁ
బూని పయోరుహాక్షుఁడె విభుండు తగం దనకంచు నెంచుచున్. 93
ఉ. ఎన్నఁడు చూతు సారసదళేక్షణుముద్దుమొగంబు శౌరి ద
న్నెన్నఁడు పెండ్లియాడుఁ జెలులెల్లను వేడుక నుల్లసిల్ల న
వ్వెన్నునిమస్తకంబున నవీనము లౌ తెలిముత్తియంపుఁ బ్రా
లెన్నఁడు నింతు వానియెద నెన్నఁడు గూర్మి వసింతు నక్కటా. 94
క. తమవా రా శౌరికి ను, త్తమమతిఁ దన్బెండ్లి సేయఁ దలఁతురొ లేదో
కమలజుని వ్రాఁత మఱి యే, క్రమముగనో నిర్ణయింపరా దంతైనన్. 95
తే. మోహనాకారుఁడును సదామోదమతియుఁ, జారుకారుణ్యతారుణ్యసంయుతుండు
భాసురైశ్వర్యఖనియునౌ ప్రాణవిభుఁడు, గలుగు టెల్లను జెలిపుణ్యఫలముగాదె. 96
చ. సరసవచోవిలాసనయచాతురిఁ దుల్యతనొందె యామినీ
కరముఖియున్ సదాహృదయకౌతుకహేతుకభావిధిజ్ఞుఁ డౌ
పురుషుఁడు నెమ్మితోఁ గలసి భూరిసుఖానుభవాబ్ధిఁ దేలుటల్
చెఱకునఁ బండుపండుట పసిండికిఁ దావిఘటిల్లుటా యనన్. 97
సీ. వామాక్షులకు నలంపగుఁ జైనయాశీలఁ బాటిల్లు ప్రియుఁడు తంగేటిజున్ను
మానినీమణులకు మదనకళాతంత్రకోవిదుం డగుపతి కెంగుపసిఁడి

పువ్వుఁబోణులకు జగత్పూజితాకారుఁ డౌపురుషుఁడు వెలలేనిభూషణంబు
అలివేణులకుఁ బూర్ణయౌవనుండై చెలంగుసుమనోహరుఁడు ముంగిటినిధాన
తే. ముద్దుముఖులకు బహువైభవానురాగ, నిరతుఁ డగునాయకుఁడు చేతినిమ్మపండు
ఇన్నిగుణములు శౌరియం దెన్నఁబడియె, నతఁడువిభుఁడౌటకన్న భాగ్యంబుగలదె.
క. ఘనసౌదామఘనాఘన, ఘనమధురాఘనసుధాసుధారాసిక్త
స్ఫురదమలతరమృదూక్తుల, ఘనమానందమున వినెడుభాగ్యం బెపుడో. 99
సీ. శీతాంబరాస్యేందుబింబ మీక్షింపక నయనోత్పలంబు లేక్రియఁ జెలంగు
హరికరాంబురుహవిస్ఫురణ లభింపక కుచముకుళత్రితము లేకరణిఁ బొదలు
శౌరివక్షఃకవాటమున రాయక కుచకనకకంచుకము లేగతిని మెఱయు
దైత్యారివాగ్వృష్టిధారలు సోఁకక శ్రవణకూపంబు లేసరణి మబ్బుఁ
తే. కృష్ణలావణ్యగంగాతరత్తరంగ, మాలికాడోలికాకేలిఁ దేలి లీలఁ
దేజరిల్లక మానసరాజహంస, మేతెఱంగున సంతతప్రీతి నలరు. 100
ఉ. విందుము ముందు పేరుఁగవ విందుగఁ బొందుగనందు మంద నా
నందము నందమున్ మెఱయ నవ్యవిలాసకళాసమగ్రుఁడై
సుందరమందహాసరుచి శోభిల వ్రేతలఁ గూడి యాడుగో
విందునిఁ జెంద మున్ జెలులు వేమఱు నేమివ్రతంబు నోఁచిరో. 101
సీ. ఘనశరంబున శౌరి తలఁబాలు వోసిన మానికంబులు శంభుమౌళి నునుతుఁ
జెలఁగి కృష్ణుఁడు నన్నుఁ జెట్టవట్టిన సుమాధవునకుఁ గేలెత్తి దండ మిడుదు
హరి తనమ్రొగుంపదాగ్రంబుఁ ద్రొక్కిన ఫణిహారునకుఁ బ్రదక్షిణ మొనర్తుఁ
బురుషోత్తముఁడు దనపొత్తునఁ గుడిచిన హరునకు నమ్రతోపహార మిడుదుఁ
తే. జక్రి దనుఁగూడి మంగళస్నాన మలమి, నాచరించినఁ బురనిశాటాహితునకుఁ
దనరనభిషేక మొనరింతుననుచుఁ దెనుచు, పరిణయోత్సాహమున నుబ్బెఁ బంకజాక్షి.
చ. చెలులకు నిత్తెఱంగునఁ జెప్పినయప్పుడె కేలిసేయఁగాఁ
దఁగతురుగాని రాజునెడఁ దప్పక యిప్పని యొప్పమీఱఁగాఁ
దెలుపుడుచేసి యొయ్యన మదీయమనోరథసిద్ధిగా శుభం
బెలమిని సంఘటింపఁగలరె చెలరేఁగి కృతోపకారలై. 103
క. అని యిత్తెఱఁగున హరిపైఁ, దనరఁగఁ జిత్తంబు నిల్పి తనలోఁ దానే
ఘనవాంఛితముఁ జింతించుచు, వనజేక్షణ పరమయోగివైఖరిఁ జెలఁగెన్. 104
ఉ. ఆయెడ నొక్కనాఁడు సచివాప్తపురోహితరాహుతావనీ
నాయకగేయకార్యరతనాయకచేటకచాటుకావ్యసం
ధాయకగాయకాన్యసముదాయకళాసకలార్థభేదనో
పాయవిదుల్ ఘటింప నిరపాయనృపాయతవైభవంబునన్. 105

సీ. అందమై శుభవిభాసందమై సృతసుధీబృందమై లోచనానంద మగుచు
సారమై భూరివిస్తారమై మరకతద్వారమై యాచకాధార మగుచుఁ
బూతమై భువనవిఖ్యాతమై సజ్జనోపేతమై మధురసంగీత మగుచుఁ
దివ్యమై బహుతరద్రవ్యమై సతతసంభావ్యమై సుభటసంసేవ్య మగుచు
తే. శుంభదంభోజరాగవిస్ఫులింగజాత, కుంభిజృంభితవిద్రుమస్తంభవితతి
జంభజిన్మణిగుంభితాదంభజాల, జాలకంబైనయొకసభాస్థలమునందు. 106
క. నిండుఁగొలువుండె దయ నధి, కుండన మాహాత్మ్యసాయకుండన సుగుణాం
కుండన నిశ్శంకుండనఁ, గుండినవిభుఁడైనభీష్మకుం డినవిభుఁడై. 107
క. అతులగతి నిల్చి కొలువై, హితులన్ బుధతతుల మతిమహితులన్ ధరణీ
పతులన్ ధృతిఁ గేరుపురోహితులన్ సుతులన్ వినంగ నిట్లని పలికెన్. 108
చ. తవిలి మదీయపుత్రి యనుతామరసాయతనేత్ర రుక్మిణిం
బ్రవిమలతేజుఁడైననరపాలతనూజున కిచ్చి ధారుణీ
దివిజులు రాజులుం బొగడ దిక్కులఁ గీర్తి వెలుంగ భూరిసై
భవమునఁ బెండ్లిసేయుటకు భావమునం దిపు డుత్సహించెదన్. 109
క. కులమును రూపము విద్యయుఁ, జెలివియు జవ్వనము నీతి ధృతియున్ మతియుం
గలిమియు బలిమియుఁ జెలిమియుఁ, గలవరునకుఁ గన్య నొసఁగఁగావలె నెలమిన్.
క. దానమ్ములలోఁ గన్యా, దానము ఘనపుణ్య మని బుధప్రకరము లిం
పూని వచింతురు గావున, మానవతతి కిది సుకర్మమార్గం బరయన్. 111
తే. తగినవరునకుఁ గన్యకాదాన మొసఁగి, పేర్మి నీరెడుతరములపితరులకును
హర్ష మొనరించియన్వయం బవిరళముగఁ, బావనము సేయుటుచితంబు ప్రాజ్ఞులకును.
క. పెద్దయు శుభకార్యంబులు, పెద్దలతో నూహచేసి పిదపన్ వారల్
దిద్దినరీతి నొనర్చుట, సుద్దామం బైనధర్మ మొదవుచు నుండున్. 113
క. హితకార్యం బతిసత్వర, గతిఁ జేయఁగవలయుఁ బూని ఘనులకు నెల్లన్
క్షితియందు దనవద్యంబుగ, స్మృతు లెన్నంగద శుభస్య శీఘ్ర మ్మనుచున్. 114
క. కావున రుక్మిణికిం దగు, భూవరసుతు నాత్మ నరసి పొలుపొందఁగ మా
కావిధ మెఱిఁగింపుఁడు స, ద్భావంబున బుధులు హితులు బాంధవతతులున్. 115
చ. అనుటయుఁ జారుకార్యగతి యారసి యారసికాగ్రగణ్యుఁ గ
న్గొని మనుజేశ నీతనయకుం దగురాజకుమారు మారుఁ బో
లినసుకుమారు ధీరు నవిలీనబలాహవశూరు మాకుఁ దోఁ
చినపగిదిన్ వచించెదము చిత్తమునం గలరీతిఁ జేయుమా. 116
చ. గొన బహురూపభావితునిఁ గోరును గన్నియ వన్నెమీఱఁ ద
జ్జననిధనంబుఁ గోరు శ్రుతిశాలిని గోరును దండ్రి చుట్టముల్

ఘనకుంజాతుఁ గోవిందు రెంట బయలెల్లను నూపుమిత్రితో
దనము భుజింపఁ గోవిదుడు తిద్దయు శోభనకావ్యవేళలన్. 117

క. అదిగావున మామాటలు, హృదయంబున కిష్ట మయ్యెనేనిఁ బ్రమోదం
బొదవ విను కేశ సతిలా, భ్యుదయమహోత్సవము చెందు మర్వీనాథా. 118

చ. యదుకులవార్ధిచంద్రుఁడు దయాగుణసాంద్రుఁ డమందసుందరా
స్పదుఁ డమిత్రతాపుఁడు విశాలయశస్సహితుండు సంతత
త్రిదశగణార్చితుండు వసుదేవతనూజుఁడు కృష్ణుఁ డాతఁడే
మదిఁ బరికింప నీ ప్రియకుమారిక కాత్మవిభుండు గాఁ దగున్. 119

మ. వసుధాధీశ్వర యమ్మహాత్ముని ప్రభావం బెన్నఁ జిత్రంబు దా
వసుధాభారనివారణార్థము మునుల్ మందారులై భీరులై
వసుదేవాదులు ప్రస్తుతింపఁ గరుణావర్ధిష్ణుఁ డావిష్ణుఁ డీ
వసుదేవాత్మజుఁడై జనించె సుగుణవ్యాపారపారీణతన్. 120

క. నూతనలీలల నందని, కేతనమునఁ బెరుఁగుచుండి కృష్ణుఁడు కడిమిం
బూతన యనియెడు నసురిన, చేతనఁ గావించె భువనచిత్రము గాఁగన్. 121

క. నికటమున దనుజమాయం, బ్రకటం బగుచుండు కెంటిఁగి పటుబలయుతుఁ డై
శకటం బొకటి ముకుందుఁడు, వికటంబుగఁ గూలఁదన్నె విబుధులు పొగడన్. 122

సీ. మారుతాసురుఁ ద్రుంచె మద్దులఁ గూకలించెఁ గినిసి వత్సకుఁ జంపెఁ దునిమె బకుని
నఘదానవునిఁ గూల్చె నలరి కాళియు నొంచె దవశిఖి మ్రింగె గోత్రము ధరించె
శంఖచూడునిఁ ద్రెళ్చె సాధించె వృషదైత్యుఁ గేశి నణంచె ముగించె వ్యోముఁ
జాణూరుఁ దెగటార్చెఁ జక్కాడెఁ గంసునిఁ దవిలియొయ్యనఁ గాలయవనుఁ జిదిమె
తే. నంజరాసంధముఖ్య లఖిలులఁ దటిమె, ద్వారక యనంగ నొకరాజధాని నిలిపె
బాంధవులకెల్ల నిత్యోత్సవంబు లొసఁగె, మనుజమాత్రుండె దేవకీతనయుఁ డరయ. 123

చ. సకలబుధానుసారి యగుశౌరికిఁ గన్య నొసంగి భూమినా
యక శుభలీలలన్ వెలయు టందము డెందమునందు నీవు వే
ఱొకన్నృపసూతికిన్ వికసితోత్పలనేత్ర నొసంగఁ జూచుట
ల్పికటరసాల మొల్లక ఫలించి ముసిండిఫలంబుఁ గోరుటల్. 124

క. అని సభ్యు లాడుపలుకులు, తనచెవులకు ములుకు లగుచుఁ దగిలినఁ గోపం
బునఁ గటము లదర నందఱుఁ, గనుఁగొని యపు డనియె రుక్మి గర్వోద్ధతుఁడై. 125

చ. అవునవు మంచిపెద్దలె బళా నరపాలునిమోల్పిల నూరకే
చివుకులు కొందుఁ జొప్పడనిచేవలు వెట్టుచు గట్టిపట్టుగాఁ
జెవులకు ములుకులై వినఁగఁ జెల్లనిపల్కులు మాటిమాటికిం
దవిలి వచింపఁ జాఁగితిరి దబ్బర లింకను జాలు మానుఁడీ. 126

తే. మదిని మీమాట పరమధర్మం బటంచు, నమ్మియుండినఁ గార్య మెంతయును జెడదె
పెద్ద లనియెడిగంపంతపేరె కాని, బుద్ధి ముదిమది దప్పినఁ గొద్దిగాదె. 127

ఉ. గొల్లలయిండ్లఁ బాల్పెరుగుఁ గొల్లలుగా సతతంబుఁ ద్రావి మ
త్తిల్లి యరణ్యదేశములఁ ద్రిమ్మరుకేస్వరుఁ గాపరిన్ గడున్
బల్లిదుఁ డంచు నెన్నెదరు నవ్వెడువారి నెఱుంగ కియ్యెడం
బెల్లుగ గొల్లబోయనికి బింకము లెంటుఁదనంబు గల్గునే. 128

చ. చివికినబండి ద్రొక్కుటయుఁ జెట్లు పెకల్చుట పాలొసంగు దా
నవి భువిఁ గూలద్రోయుట వనంబునఁ బాముకు గొంగ నెద్దు వా
రువమును గర్దభంబును విరోధు లటంచుఁ దలంచి చంపుటల్
శివశివ విక్రమంబు లని చెప్పఁగఁ జిత్రము లయ్యె నియ్యెడన్. 129

క. మంచిది మీపలు కిప్పుడు, వంచింపఁగ వలదు బాంధవమునకుఁ దగునే
క్రించుఁడయి మేనమామం, ద్రుంచినఖలుఁ డెంతబలయుతుం డై యున్నన్. 130

చ. సరిసరి మీవిచార మిఁకఁ జాలు శిరీషసుమోపమానభా
సురసుకుమార యై సకలసూరిజనాభినుతోల్లసద్గుణా
కర యగురుక్మిణిం బసులకాపరి కియ్య మదిం దలంతురె
గురుతరరత్నహార మొకకోఁతి మెడం దవిలింపఁ జూతురె. 131

క. మీ కిష్టం బని వరచా, మీకరనిభగాత్రి నెట్లు మీఁదెఱుఁగక నేఁ
డాకటిగొల్ల కొసఁగుదురు, కాకి మెడం దొండపండు గట్టినభంగిన్. 132

చ. కటకట సర్వభూభరణకారణభూరిభుజాగ్రజాగ్రమ
త్కటపటుశింజినీనినదకార్ముకముక్తశరాహ్వతారిరా
ట్కటపటలుండు భీష్మకనృపాలుఁ డనం బ్రథ మీఱి యీతఁడే
కుటిలతనొంది గొల్లనికిఁ గూఁతు నొసంగిన నవ్వరె జనుల్. 133

క. మావాక్యము గొఱగాదని, తా వేఱొక టనుట వడుచుఁదన మిది యనుచున్
భావింపక దయఁ జూడుఁడు, వేవిధములఁ గేలు మొగిచి వేఁడెద మిమ్మున్. 134

తే. ఘనుల కెల్లను దమడెందమునకు నిష్ట, మగు తెఱంగున నొనరింపఁదగును గార్య
'మాత్మబుద్ధిస్సుఖంచైవ' యనెడు వచన, మరయ నిద్ధాత్రిపై నిశ్చయంబు గాదె. 135

క. శశిముఖి యగురుక్మిణి న, వ్వశుపాలున కొసఁగ నొల్లఁ బదివే లైనన్
వశీకృతపరబలుఁ డగు, శిశుపాలున కిపుడు పెండ్లి సేయుదుఁ బ్రీతిన్. 136

ఉ. సంగరరంగరంగదరిసామజభీమజవప్రదీపితో
త్తుంగమృగేంద్రుఁ డంగిభవతుల్యమనోహరమూర్తి భూమిభృ
త్పుంగవవర్ణనీయపరిపూర్ణగుణాకరుఁ డిందుచంద్రికా
భంగయశోన్వితుండు శిశుపాలుఁడు చూడ నృపాలమాత్రుఁడే. 137

# ద్వితీయాశ్వాసము.

---



రుచిరతరసితాంగా
కారుణ్యామయాంతరంగకలుషవిభంగా
పారావారనిషంగా
గోరాజోన్నతతురంగ కుక్కుటలింగా. 1

తే. అవధరింపుము మును శౌనకాదిమునుల, కనఘుఁ డా సూతుఁ డెఱిఁగించినట్లు వ్యాస
సుతుఁడు సుమహితకౌతుకోన్నతిని భరత, కులునకవ్వలికథయునుఁ దెలుపఁ దొడఁగె 2

క. నరవర విను భీష్మకభూ, వరుఁ డాక్రియఁ బుత్త్రునపను వశుఁడై పుత్త్రీ
పరిణయకార్యారంభ, స్ఫురణం జెలరేఁగి యొక్కశుభకరవేళన్. 3

ఉ. రమ్మ రయంబె కుండినపురమ్మునకున్ సచివాప్తబంధుజా
తమ్ముఁ గూడి నీ కవితథమ్ముగ నిచ్చుట రుక్మిణిన్ వివా
హమ్మొనరింతు రాజనివహమ్ములు మెచ్చఁగ నంచు జాళువా
కమ్మ లిఖించి పంచెఁ గుతుకమ్మలరన్ శిశుపాలుపాలికిన్. 4

ఉ. పంచినరేఖఁ గాంచి శిశుపాలుఁడు తద్దయు నుత్సహించి య
ర్థ్యంచితకాంచనాంబరచయంబున దూత కప్పు డి
ప్పించి సమస్తబాంధవులఁ బెద్దల సంగడికాండ్ర నెల్ల రా
వించి వివాహలేఖఁ జదివించిన వారలు సంభ్రమించుచున్. 5

తే. మంచిపని యయ్యె నిప్పుడు భీష్మకునితోడఁ, జుట్టఱికి మబ్బె నెంతయు సులభమగుచు
నిందులకు సంశయింపంగ నేటి కింక, శోభనోద్యోగ మాచరించుట మతంబు. 6

చ. అదియునుఁ గాక రుక్మిణియొయారము సార మయారె సారెకున్
వదలక భూసురేంద్రు లనవద్యగతిన్ నుతిసేతు రా నవాం
బుదనికరోపమానకచఁ బోలరు పన్నగరాజకన్యలున్
సదమలసిద్ధసాధ్యసురచారణకన్యలు రాజకన్యలున్. 7

చ. అలికులవేణియుం బిసరుహాననమున్ నిడువాలుఁ జూపులుం
జిలిబిలిపల్కులుం దళుకుఁ జెక్కులుఁ గెంజిగురాకుమోవియుం

గులుకుమిటారిగుబ్బలను గొప్పపిఱుందులు లేఁతనవ్వులుం
గలయలరుక్మిణిం బొగడఁగాఁ దరమే పరమేష్ఠికైనియున్. 8

ఉ. సారము ముద్దుఁబల్కు ఘనసారము నిద్దపుమేనితావి కా
సారము నాభిరంధ్రము విసారము తేటమిటారిచూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చొకారము నవ్వుమొగంబు పట్టదా
కారము కొప్పు సన్మథవికారము మోవి వధూలలామకున్. 9

క. కనకంబే మెయివన్నియ, కనకంబే ముక్కు విమలకమలేక్షణకున్
ఘనమే జఘనము మేచక, ఘనమే చికురాకలి నలరు కచ మంగనకున్. 10

క. లికుచంబులుగద చనులా, లికుచంబులు తేంట్లు పైఁదలికచంబులు తే
మకరంబులు కెందమ్ములు, మకరంబులు జంఘ లాహిమకరాననకున్. 11

తే. మంద మానప నెన్నడుమంద మాన, ఘంబు కుచపాళి కనకకుంభంబుడంబు
చందమామకుఁ దుడు మోము చంద మామ, నోజతూపులు చూపులు రాజసుతకు 12

సీ. తరుణేందుబింబంబుఁ దచ్చంద్రికాతతి నదలించునాననహాసములను
దంతికుంభంబులఁ దద్గమనంబుల నపహసించునురోజయానములను
దర్పకాశుగములఁ దచ్ఛరాసనములఁ బూని మోడించుదృగ్భ్రూయుగములఁ
దామరపువ్వులఁ దద్బిసశ్రేణులఁ బరిభవించుకరాంఘ్రిబాహువులను

తే. శరధివీచులఁ దన్మహాసైకతముల, గదుమఁబొదలువళిత్రయికటితటములఁ
జంపకంబులఁ దన్మృదుసౌరభముల, మొనయునాసాంగవాసనలను వధూటి. 13

క. ఆకామిని నుద్వాహం, బై కామునిఁ గెల్చి చిరతరానందరసా
స్తోకగతిన్ వసియించుట, నాకాధికసౌఖ్యలీల నలరుట సుమ్మీ. 14

ఉ. మంచముకోటఁ జేనె యిడుమాడ్కిఁ దనంతనె తానె యిప్పు డా
చంచలనేత్ర నెఁదుఁచి సారయశుం డగుకుండినేశ్వరుం
డంచితలీలఁ గాంచనమయం బగుశోభనలేఖ యంపి పి
ల్పించినయప్పు డేటికిపలేన్ మఱి జాగిఁక నంచు నెంచుచున్. 15

భృత్యులఁ దీర్పరులైనయ, మాత్యులఁ గన్గొని ప్రమోదమతి నఖిలజన
స్తుత్యముగ మంగళోచిత, కృత్యము లొనరింపఁ బనిచెఁ గేరుచు వారున్. 16

పరిపరివిధముల నమరన, గరిగరిమన్ మెఱయుపురి జగన్నుతగతి వా
విరి విరివిగ నలరఁగఁ జే, సిరి సిరి కిర వగుచుఁ గ్రొత్తచెలువు దలిర్పన్. 17

శిల్పకకారదలేపకచిత్రకారి, రజకమాలికకుంభకారకకువింద
చర్మకారకముఖ్యుల సరగఁ బిలిచి, పలయు నర్థ్యోపస్త్రియోజనంబులు ఘటించి. 18

దివ్యము లగుకల్యాణ, ద్రవ్యములుం గూర్చి సద్మదంబున నిఁకఁ గ
ర్తవ్యం బెయ్యది యనుటయు, కార్యమతిం బొరిప లైనబంధువు లెల్లన్. 19

గీ. నెమ్మి యనుపెండ్లిలగ్నంబు నిర్ణయించి, కమ్మ వ్రాయించి యాభీష్మకక్షితీశు
భటునితోఁ గూర్చి మతిమభటునినొకని, నొనరఁ గుండిననగరికిఁ బనుపుటయును.

క. ఆభటు లిరువురు బలజి, ద్వైభవుఁ డగుకుండినేంద్రు దర్శించి వెసన్
శోభనపత్త్రిక యొసఁగఁ జి, రాభినవానందమందహాసాననుఁ డై. 21

క. మణికల్యాణాంచితభూ,షణము లనేకంబుగా నొసంగి నృపాగ్రా
మణి కల్యాణాంచితభా, షణములఁ జేదీశభటుని సంతసపఱిచెన్. 22

ఉ. అంతట వాని వీడ్కొలిపి యాప్తుల బాంధవకోటులన్ మహా
కాంతులఁ బిల్వఁబంచి శుభకారణవస్తువులెల్లఁ గూర్చి పు
రంతయు వింతమీఱఁగ రయంబ యలంకృతి సేయుఁ డంచు న
త్యంతకుతూహలం బలర నాజ్ఞ యొసంగినఁ బౌరు లందఱున్. 23

ఉ. గోడలనెల్లఁ జిత్తరువు గూరిచి నిద్దపుఁజందమామరా
మేడ లలంకరించి జిగి మీఱఁగఁ బల్లవహల్లకంబులం
గూడినరత్నతోరణపుఁగోటు లమర్చి బహిర్విహారపుం
జాడల వీథివీథులను జల్లిరి సారపటీరనీరముల్. 24

క. నిగనిగజిగిఁ బొగడఁగఁ దగు, పగడపుఁగంబములు నించి పఱపుదలిర్పం
సొగసుగ ముత్తెపుఁబందిరు, లగణితముగ నిల్పి రప్పు డాకస మొరయన్. 25

ఉ. రంగుగ మేలిబంగరు మెఱుంగులరంగుల నంగనామణుల్
పొంగుచు రంగవల్లికలు పోఁడితనంబుల వ్రాసి వాసి మీ
ఱంగ మృగీమదంబుఁ గపురంబును సాంకవమున్ మెదించి యు
త్తుంగకపోతపాలికల దోర మొలప్పఁగ మెత్తి రత్తఱిన్. 26

తే. పురములోపల రత్నగోపురములెల్లఁ, గరము మెఱయ నలంకృతి నెఱి నొనర్చి
భూరిశోభాసమేతప్రభూతశాత, కుంభకుంభంబు లామీఁదఁ గుదురుపఱిచి. 27

క. నగరులలోపలఁ గపురము, నగరులధూపములుఁ బెట్టి యతిశయగతి న
న్నగరిపునగరికి సరియౌ, న్నఁగ నగణితలీలఁ జెలువొనర్చిరి వరుసన్. 28

వ. అప్పు డప్పురవరంబు మరకతమణికృతవితతవిభావిభాసితోన్నతజాలకజాలకాంతర్ని
ష్క్రాంతాగరుధూపధూమశ్యామాభ్రభ్రమామితకామిత లీలాఖేలనలోలశాలానీల
కంఠానీకంబును, ప్రతినికేతనకేతననూతనవితానశతానర్ఘ్యమణినికాయకాయమాన
విరాజమానంబును, నవరత్నకీలితలాలితశోభాసమానభాసమానానూనమానవేశనివేశ
ద్వారాపార ప్రమోదపూరణకారణతోరణావలంబ బింబఫలశంకాంకురకరామలకమ
లరాగోపలచాపలభావభావన్మహోత్సుకశుకనికరంబును, ఘనఘనసారసారసారంగ
మదామోదకహిమోదక ధారాభిషిక్తసంసక్తముక్తాఫలచూర్ణకీర్ణనిరర్గళ రాజ
మార్గంబును, సభాభవనభువనాద్భుతకిరారచిత రుచిరతరవ్యాజరాజీవరాజోన్ముఖనా

రంభ సంరంభ సమయసమర్యాదాకుంఠిత కపటకంఠీరవ భైరవాకార విలోకనభీతభీత మాతంగవ్రాతంబును, ధాళధళ్యప్రభాపూరహీరశిలాబద్ధస్నిగ్ధకుడ్యాంతర్నిహితమహిత ముకురనికురుంబబింబితాభ్యర్ణస్వర్ణస్తంభోజ్జృంభమాణమాణిక్యఖచిత పాంచాలికాబాలికావదనేందుబింబచుంబనలాలస బాలికాయువజనభజనాభిరామంబును, ప్రభూతశాతకుంభకుంభరంభాస్తంభగుంభ ద్బహిర్ద్వారప్రదేశంబును, రంగత్తుంగరంగ మదాగరుచందన చంద్రకలంక సంకుమదాదికామోదశాదమేదురవేదికాంగణదేహళీమోహనంబును, సురుచిరదకీమహారాంతర నిరంతరనిద్రారత ఘోరతరేభాహితోత్థసన్నద్ధహేతుకకౌతుకప్రణాదితవిదితమురజదర్దురఝుర్ఝరపటుపటహకాహళభూరిభేరీభాంకారనినదంబును, సువాసినీకృతమంగళగానానురూపతానమాన సంధానకగోపురోపరిపరిస్ఫుటత్కనకఘటాంతర్న్యస్తప్రశస్తలీలారవిందనిష్యందన్మరందపానానందితసుందరేందిందిరబృందామందమధురఝంకారంబును, నిరతభరతకళాకౌశలప్రవర్తిత నర్తకీజనఘనస్వేదోదకాపనోదకమహోద్యాననానాసుగంధగంధిలసౌగంధికసారససౌరభ్యసరస సరసీతల శీతలమారుత చారుతరంబును, విలసితఫలకుసుమవిసరాపసర నైవేద్య సద్యోఘృతయుత పూపసూపాన్నధూపదీప నాళికేరపేటీరాజన్నీరాజనపూజనాలంకృతదేవతాయతనంబును, హాటకతాటంకకంకణకింకిణీవలయ తులాకోటికోటీర హారకేయూరగ్రైవాభరణచరణ కటకోర్మికాంచత్కాంచీముఖనిఖిలవిభూషణాంబరమాల్యానులేపనప్రదీపిత సకల యువయువతీజనమనోహరంబును, బహువిధవర్ణోల్లిఖిత చిత్రశ్రీలాతిరస్కృత తిరస్కరిణీజాతజాలరూపనిర్మిత నిర్మలహర్మ్యభిత్తికానిచయంబును, మకర నికరాహీన మీన తిమీన ధులీ కుళీర దుర్ధర దర్దురోద్రోరగాంభఃకుంభికుంభీర నీరాధార పరిఖావిహారమాణ మానసౌకఃకోకాద్యఖిల ఖగకుల కలకలారావానుకూలతాళ ప్రమాణమానిత పూర్ణకుంభసంభారాతిమందయానానుకరచిరంటీమంజుమంజీరనినదంబును, పవనజవననిరాఘాట ఘోటకబంధురసింధురారోహణకోణకృపాణ బాణబాణాసనాద్యనేకాయుధాభ్యాసవాసనాప్రవీణతరుణీవరకుమారవర్గంబును, చతురచతురాగమపారగోర్వీసురభాసురాశీర్వాదనాదవేదనాదామోదకరంబు నై త్రిదివంబునుంబోలె వివిధబుధప్రకరాకరంబై వైకుంఠపురంబునుంబోలె ననవరతలక్ష్మీనివాసంబై కైలాసస్థానంబునుంబోలె సర్వమంగళాలంకృతంబై సత్యలోకంబునుంబోలె నతులితశతానందంబై రసాతలంబునుంబోలె నవిరళకంచుకిసమంచితంబై యొప్పె నంత. 29

క. ఇత్తెఱఁగంతయుఁ దనచెలి, కత్తె లెఱింగింప విని మొగంబున దైన్యం
బెత్తుకొన నప్పుడు రుక్మిణి, చిత్తము దత్తఱము నొందఁ జిడిముడిపడుచున్. 30

సీ. కటకటా రుక్మి యన్యాయకర్ముఁ డిప్పుడు, చేదిభూనాథునకుఁ బెండ్లి సేతు ననుచుఁ
బూని యున్నాఁడు వాని కీబుద్ధి మాన్పి, తవిలి శౌరికిఁ గూర్చువా రెవరు గలరు.

క. వినయవిహీనుం డగుచును, దనయానతి మీఱి తిరుగుతనయానుమతిం
బని యొనరింపఁగ దొరఁకొనె, జనకుండును వేఁదురగుచుఁ జంచలబుద్ధిన్. 32

చ. చెఱకున బండు లుద్భవము సేయక బుద్ధివిహీనుఁ డై ఫలో
త్కరము ముసిండిచెట్టునకుఁ గల్గఁగఁజేయుచు నున్న కైవడిన్
హరిహర పాపజాతివిధి యానవమాలికిఁ గూర్చ నొల్ల కీ
నరమునికృష్టుఁ డైనశిశుపాలున కేక్రియఁ గూర్చెఁ జూచెనో. 33

చ. సరసగుణాభిపూర్ణుఁ డగుశౌరిపదాంబుజసేవ సేయఁగా
మరిమరి గోరుచిత్త మిఁక మక్కువ నన్యులఁ జేరఁ గోరునే
నిరతశుభాకరామరధునీప్రఘనీవిరాజమార్గ్మకా
పరిచితరాజహంస మొకపట్టున పచ్చికపట్టుఁ జేరునే. 34

క. హైమవతి కిప్పుడు నాపై, ప్రేమ మదిం గలిగెనేని వెస నొనఁగూడున్
దామోదరసాంగత్యము, దామోదరసాభ్యుదయనిధానం బగుచున్. 35

సీ. కృష్ణమేఘ మురోజగిరిశృంగములమీఁద మెఱుపు దీపింపఁగా మెలఁగు టెప్పుడు
మెలఁగి గంభీరవాగ్విలసితనిర్ఘోషములచేతఁ బలుమాఱుఁ జెలఁగు టెప్పుడు
చెలఁగి కృపారసోజ్జ్వలజలధారలు మరిమరి దఱచుగాఁ గురియు టెప్పుడు
కురిసి మనఃక్షేత్రగురుతరతాపాగ్ని యడఁగ నిర్భరలీలఁ దడుపు టెప్పుడు

తే. తడిసి సంతతసౌఖ్యప్రదంబు లగుచు, మెండుకొని కామసస్యముల్ పండు టెప్పుడు
నిప్పుణమతి నూహయొనరింప నపుడుగాక, తొలఁగునే దైన్యమతియెల్ల దూరమగుచు.

ఉ. మారునిఁ గేరుచారుసుకుమారుని నందకుమారుని న్మనో
హారుని మానిమానసవిహారుని సన్మణిహారునిన్ రమా
ధారుని ఘోరశాస్త్రవిదారుని శర్వుదుదారునిన్ సదా
చారుని భక్తరక్షణవిచారుని నేక్రియఁ జూడఁగల్గునో. 37

ఉ. ఎవ్వరి వేఁడుకొందు మది నెంతని మోహము నిల్పుకొందు నిం
కెవ్వరు పంకజాయతదళేక్షణుఁ దోడ్కొని తెచ్చి యాత్మలో
నెవ్వగ మాన్పఁ జాలుదురు నీలబలాహకవర్ణుఁ డెప్డు తా
నివ్వసుధేశ్వరాఘముల నెల్ల జయించి వరించు నన్ గృపన్. 38

సీ. వికసితవిశదారవిందబృందంబులు గిరిరాజసుత కొసంగినఫలంబు
కలితప్రభాపూరకర్పూరపారతుల్ శివవధూమణికి నిచ్చినఫలంబు
మధురతామోదితమధురసంబుల జగజ్జనని కర్పణ మొనర్చినఫలంబు
కమనీయకల్హారసుమదామములు చండికకుఁ గూర్చి యిడిననిక్కపుఫలంబు

తే. కొదవఁ బొదవక యిప్పుడొనఁగూడెనేని, నందనందనుఁ డతులితానందుఁ డగుచు
ననుఁ గృపాదృష్టి నీక్షించి నగుచు మధుర, భాషణంబులచేఁ గరస్పర్శ సేయు. 39

క. హరినీలోపలనిభుఁ డగు, హరి నీలోపలనె తెచ్చి యవనిపులెల్లం
బరిణయ మొందఁగ నాకుం, బరితోష మొనర్చుపుణ్యపురుఁ డెవ్వఁడొకో. 40

క. అని కజ్జలజలధారలు, కనుఁగవ దొరఁగఁగ దురంతఘనతరచింతా
వినమితముఖి యగుకాంతా, జనరత్నముఁ గాంచి యొక్కసఖి యిట్లనియెన్ 41

క. ఘనుఁ డగుభీష్మకజనపరు, తనయవు సతతప్రకాశితనయవు సిరులం
దనరినదానవు మానస, మున నిటు వగ పేటికమ్మ ముద్దులగుమ్మా. 42

తే. అనతివమ్మ యిప్పుడె నీయాన తీఁగ,బోఁణి కూరిమి మదిలోనఁ బూని వేగ
దానవారిని దెత్తు నీదానవారి, రాశినడుమను వెలయుద్వారకకు నరిగి. 43

ఉ. మేలు బలా బలానుజుఁడు మేటి సుమీ యబలా బలారియుం
జాలఁడు వానివైఖరులు సారమతి న్నుతిసేయ నట్టిగో
పాలకుమారుఁ గోరి శిశుపాలుని నొల్లక యున్నదాన విం
కేల మదిన్ విచార మిపు డీక్రియ చక్రి కెఱుంగఁ జేయుమా. 44

ఉ. ఓరమణీలలామ యిటు లూరక కోరికలూర సారెకుం
జేరుకొనంగ నేమిటికిఁ బెక్కువిధంబుల నీకు వేఁడు కా
తీరున నాచరించెదము తెల్పుము నిక్కము మీఱ మేము నీ
వారము గామె యేమి పగవారమె వేఱె మఱొండు నేర్తుమే. 45

క. ఎల నగునీకోరిక మా, వల నగుఁ గల నైనఁ జింత వలవదు మదిలోఁ
గల దెఱిఁగింపవె ముద్దులు, చిలుకఁగ మాతోడఁ బలికె చిలుకలకొలికీ. 46

క. నవలా నెఱ వగునీయభి, నవలావణ్యంబు తెఱఁగు నలినాక్షునకుం
జెవిసోఁకినంతమాత్రనె, తవిలి వెసన్ రాకయున్నె తత్పరమతి యై. 47

తే. సతతసత్యవ్రతునిగుణాన్వితుని మతిమ, హితునివిహితునిమాపురోహితునిసుతునిఁ
బనుపఁగదవమ్మ సరగ నోపసిడి బొమ్మ, తడ వొనర్పక యాజనార్దనునిఁ బిల్వ. 48

క. అను నెచ్చెలినునుఁబలుకులు, విని యచ్చెలి మదిఁ జెలంగి వెర వెఱుఁగఁగఁ గొ
ప్పిసఘనవినయాన్వితన, మ్మని తనదరి నునిచి మిగుల హర్షము వెలయన్. 49

ఉ. చంచలనేత్ర నీదు నెఱజాణతనంబున మన్మనోరథం
బంచితవైఖరిన్ సఫలమై పెనుపొందుఁగదా గదాగ్రజుం
గాంచినయంత మంచిమణికాంచనదివ్యవిభూషణంబు లి
ప్పించెద నీకు నే నెలమిఁ బెట్టెఁడు పెట్టెడు నింపు మీఱఁగన్. 50

క. నీమహిమకు సరిపోల్పఁగ, నీమహి మఱి కలదె తలఁచు లేమిటి కిటు లో
రామరొ నీ విపు డనినధ, రామరు నిచ్చటికిఁ దెమ్ము హర్షం బెసఁగన్. 51

ఉ. నావుడుఁ జెల్మికత్తె నృపనందనకుం దనకూర్మి చూపుచుం
బావనచిత్తుఁ డై నిగమపారగుఁ డై వెలుఁగొందు చున్నభూ 52

దేవకుమారుఁ జేరి సారిదిన్ మధురోక్తులఁ దత్ప్రకార మెం
తో వెరవొప్పఁగాఁ దెలిపి తోడ్కొని ముందరఁ దెచ్చి నిల్పినన్. 52

క. జగతీసురసుతు శశిమణి, జగతిం గూర్చుండఁజేసి సవినయనిర్వ్యా
జగతిం బూజ లొసంగి త్రి, జగతీస్తుతసుందరాంగి చతురత ననియెన్. 53

చ. సరసిరుహాసనాన్వయనిశాకర నన్ గృప నాదరించి యి
త్తఱి నుపకార మొక్కటి యుదంచితలీల నొనర్చి లోకభా
సుర మగుకీర్తిఁ జెంది సరసుల్ నుతిసేయఁ జెలంగు ముర్విపై
నరయఁ బరోపకారవిమలాత్ములు గారె బుధేంద్రు లెప్పుడున్. 54

తే. విను ధరామర హరికి విద్వేషి యగుచుఁ, బాపమతి రుక్మి నను శిశుపాలుఁ గొసఁగెడు
పరమదౌర్భాగ్యనకు నేఁడు పరిణయంబొ, నర్పనూహించియున్నాఁడు దర్పమెసఁగ.

క. ఈకుండినపతి శక్తుఁడు, గాకుండినవాఁడు వానిఁ గాదని హరియున్
రాకుండిన నిపు డతనికి, నీకుండినఁ గోర్కెలెల్ల నెట్లొనఁగూడున్. 56

ఉ. ఓవసుధాసుధాశనకులోత్తమ చిత్త మహర్నిశంబులన్
బావని రైనకృష్ణపదపంకరుహద్వయిసేవఁ గోరుచుం
గేవలకౌతుకస్ఫురణఁ గోరుచు నున్నది యెన్నిభంగులన్
నీ వరుదెంచి యివ్విధము నేర్పున శౌరికి విన్నవింపవే. 57

క. భూసురనిరుపమగుణగణ, భాసురఘనరాజహంసపరిచితలీలా
వాసంబు గాక మానస, కాసారం బీక్రియం బ్రకాశత నొందున్. 58

చ. మెఱయుచు నీలవర్ణమున మీఱి నిరంతరచంద్రికాప్రభా
కరసముదంచితాంబరముఁ గప్పి గభీరతరప్రణాదభా
సురుఁ డగునట్టియాఘనుని సొంపుగఁ దోడ్కొని తెచ్చినప్పుడే
యిరవుగ భూరివృష్టిఁ గురియింతుఁ జుమీ ద్విజముఖ్య యర్మిలిన్. 59

క. సాక్షులు సుమిత్త్రామర, సాక్షులు నీకొసఁగుదాన నభిమతము కృపా
వీక్షణమునఁ గన్గొని నీ, వీక్షణమున ద్వారవతికి నేఁగుము విప్రా. 60

శా. నీకుం జెప్పెడిదేమి భూమిసుర యానీరేజపత్త్రాక్షుతో
నాకార్యంబు సమస్తముం దెలిపి యానందంబు గావించి య
స్తోకానేకపవాహవాహినులతోఁ దోడ్తెమ్ము పొమ్మంచుఁ దా
నేకాంతంబునఁ గొన్నిమాట లపుడే యేర్పాటుగాఁ దెల్పినన్. 61

క. విని బాడబకులతిలకుఁడు, ఘనతరపరితోషహృదయకమలుం డగుచున్
వనితామణిఁ గన్గొని యి, ట్లనియెన్ మృదువచనరచన లలరారంగన్. 62

క. లలనా సురుచిరతరలీ, లల నాన్నృపుఁ దెత్తు వేయులాగులఁ దెలుపన్
వలెనా మదిఁ దలఁపఁగ నీ, వలె నాకిఁక నాప్తలైనవారలు గలరే. 63

ఉ. ఇంతిరో యింతచింత మది నేటికి నేఁటికిఁ జూడు శౌరి చే
పెంతయు సంతసం బలర నెల్లజనుల్ వినుతింప మేదినీ
కాంతులఁ బాఱఁదోలి నినుఁ గైకొనుఁ జైకొని యోడి ఖిన్నులై
పంతము వీడి రుక్మి శిశుపాలజరాసుతు లిండ్లు దూఱఁగన్. 95

క. మోహావేశంబున నటు, లాహా యాహార ముడిగి హాహా యనుచున్
నీహారకరముఖీఘన, సాహసవృత్తి న్నెలంగఁ జూడరయె నీకున్. 96

చ. అలరెడురాజనందనుల నాత్మగతంబునఁ గోరి కేరి మున్
వలచినవారు లేరొ యిటువంటివి గంటిమె యెందునైన నీ
వలన బళా బళా తెలిసి వచ్చెను వింత లొకింత యిప్పుడో
కులుకుమిటారిచిత్తమునఁ గోపముఁ గల్గినఁ గ్రన్ని మ్మెఁకెన్. 97

క. చీటికిమాటికి నేటికి, నాటికిఁ బాటిలెడుతోడిసకియలపైఁ గో
పాటోపము చూపెదవు వ,ధూటీ యిటుదగునె యెంతవొరతనమైనన్. 98

ఉ. వంచనతోడ నూడిగపువారిజగంధులు చేరి సేవగా
వించఁ గణంగినం బరిభవించి సళించుచు ముందు పొంగుగాఁ
బెంచినరాజహంసశుకబృందములన్ బెదరించె దేటికో
చంచలనేత్ర నీవలపుచందము లెంచఁగఁ జిత్ర మియ్యెడన్. 99

ఉ. నాన వహింప కిట్లు దగునా నవసూనశరానలార్తి లో
నానఁగ మానరానితమి నానగధారిఁ దలంచి చెల్లఁబో
దీనగతిం గృశింప వెలఁదీ నగరే నగరి న్మతి న్మతిన్
మానినులెల్ల నెంచుకొనుమా నిను మాటికిఁ బల్కు నేటికిన్. 100

సీ. జలకంబు లాడనిచులుకఁదనం బేమి గంధంబు పూయనిచంద మేమి
తొడవులు దొడుగనియుడుగనిచల మేమి తిలకంబు దిద్దనికలఁక యేమి
ముకురంబుఁ జూడనివికలభావం బేమి విరిసరుల్ దాల్చనివరుస యేమి
పెన్నెఱుల్ దువ్వనివిన్నఁదనం బేమి యాహార మొల్లనియూహ యేమి
తే. రామ యీరీతి వర్తింపరాదు నీదు, కోర్కు లేడేఱు నందునికొడుకు చేత
యేపుతోఁ జెలి నిన్వరియించు నించు, కైన మదిలోన సంశయం బందవలదు. 101

చ. సొలయక నూడి వేడుకల శోభిలి జాబిలిరాలమేడలోఁ
దళుకుఁబసిండిజీనిపనితల్పముపై వసియించి నీవునుం
జెలువుఁడు సారెసారెకును జిత్రవిలాసములన్ మెలంగుచోఁ
దలఁతువొ లేదొ మ మ్మపుడు తామరసాక్షి నిజంబుఁ దెల్పుమా. 102

క. అని యనుఁగుఁజెలులు పలికిన, విని వనరుహనయన వినయవినమితముఖియై
ఘనతరలజ్జాభరమునఁ, దనమది నూఱడిలి యుండె తమి నిగుడంగన్. 103

సీ. ప్రకటపాలాశకోరకనఖక్షతియును సురవాంఛితరసాగ్రశేఖరయును
సమదమిళిందనిస్వానసీత్కారము ఘనవికసత్ప్రసూనహారమణియుఁ
కీరశారీరవకింకిణీనినదయు కంఠస్థలాంతాపరిరంభణయును
పరిష్కృతసందష్టపల్లవాధరయును గళదురుమకరందఘర్మకణయుఁ
తే. పరిమళానిలనిశ్వాసభాసురయును, వికటఘనసారచూర్ణవిభావితయు నగుచు
నవరివనలక్ష్మి మాధవు నలరఁ జేసెఁ, గూడి క్రీడించె వేడుకతోడ నపుడు 115

వ. మఱియుసుం జాఱుకు నిలుతురంగంబులం బూన్చిన గోరగోరం బరువుపెట్టుచున్న నరుణోదయారుణంబు నభంబున కెగయ విసవిసనగు నుడిగాడ్పులును, గాడ్పులవలనం జలించుచు బెడిదంపుటెండ సంప్రసారమ్మున నెరి నెరి జలజలరాలు కారాకుతండంబులును, కారాకుతండంబులెల్ల డుల్లిన వెల్లన నెల్లంబుగఁ గవచంబులు దొడిగి యుడుగని చలంబునఁ బయ్యానకుఁ గాలు ద్రవ్వుచు నిల్చిన బిరుదురాహుత్తుల పగిది నిగుడుజొంపంబుల నగుమహీరుహంబులును, మహీరుహాగ్రంబు లెక్కి వెక్కసంబుగఁ గెంజివురులం జెక్కి చొక్కి పొగరెక్కి నిక్కి చిక్కక యుక్కు మీఱుచుం బరుల కెన్నాడి నిలు నిలు పోకు పోకు మని తాఁకం గూఁక లిడు వీరభటుల యట్లు కో యని కూయుపికనికరంబులును, పికనికరంబులకుఁ దోడుగఁ గూడి కీరు బొగడజీరుల బిరుదులం బొగడు బందిబృందంబుల చందంబున నందంబుగఁ బల్కు శుకంబులును, శుకముఖోపమానముకుళాకారంబులై భీమంబుగ నెదిరి పిఱుతివియక కఱకుటడిదంబులు వెఱికి యుఱికి నఱకులాడి యచ్చంపుపచ్చి గాయంబులతో నలరు శూరులతీరునం గేసుకంబులును, పలాశభూతభేతాళ నిచయంబులకుఁ బ్రియంబు లగు మాంసఖండంబుల లాగునఁ బ్రొగులై రాలు పాటలీకుసుమంబులును, గుసుమరసాస్వాదంబున మోదంబున మీఁదికి నురవడి నెగయుచు మరునిమౌర్వీనాదంబులవిధంబున ఝుంకారంబులు సేయు మధుకరంబులును, మధుకరంబు లాస్వాదంబు లొనరించుతఱిం గ్రిందికిం జింది రక్తప్రవాహంబులపోలికం జాలువాఱు పూఁదేనెతేటలును, తేనెతేటలయొరపు మకరందధారలం బదనెక్కి మస్తిష్కపంకంబుల పొంకంబున నొప్పు పుప్పొడిపుప్పిలును, మెఱుఁగుటరిగల గరిమ వెలుంగు గురువింద విరిగుత్తులును, గేతనంబులకతిఁ బొదలు చలదళపల్లవంబులును, వాఁడిబల్లెంబుల పోఁడిమిం జెన్నారు గేదకీదళంబులును, దంతిదంతములీలం గ్రాలు మల్లికాప్రసవంబులును, విపులాతపత్రమౌక్తికంబులభాతి దుల్లు శిరీషకుసుమంబులును, చామరంబులకై వడిం బడు రసాల మంజరులును, నాసలమాడ్కిం దోఁచి జాఱు చంపకంబులును, మస్తకస్తోమంబుల వడువున నెపతెగక పుడమిం బడు కపిత్థంబులును, మొండెంబుల తెఱంగునం బొరలాడు పనసఫలంబులుం గల్గి ఘోరరణరంగంబు నధిగమించుచు, వేశవాటికయుంబోలె నపరిమిత పల్లవసల్లలితంబై, త్రిదివంబునుంబోలె నమితసుమనోవిరాజితంబై, తూణీరంబునుంబోలె

సాంద్రశిలీముఖోపేతంబై, వితరణి న్నృపసభాభవనంబునుంబోలె ద్విజగణపరివృతం
బై, సరోవరంబునుంబోలెఁ గువలయామోదకరంబు నై యొప్పె నప్పుడు. 116

తే. రుక్మిణీకన్యమదిని నిరూఢమైన, విరహతాపభరంబున వేఁగి వేఁగి
యోర్వఁజాలక కృశియించుచుండి యొండు, దెఱఁగు భావింపనేరక దిగులు వూని.

ఉ. పట్టెలఁ జేతు లానుకొని పానుపు మెల్లనె డిగ్గి పాదుకల్
మెట్టక చేలచెంగు దగ మేలిముసుంగిడి కీరశారికల్
చుట్టును రాఁగఁ బోఁ దఱుముచుం జెలికత్తియలన్ మొఱంగి యి
ట్టట్టును వర్దెల్ గనుచు హా యనుచున్ వలపూనిఁ దిట్టుచున్. 118

ఉ. వేసలి జాఱ సూనశరవేదన మీఱ శ్రమాంబుబిందువుల్
మేనను జాలువాఱ మది మిక్కిలి గోరిక లూరఁ గేరి తేం
ట్లాననపద్మగంధమున కర్మిలిఁ జేర మరాళయానయై
కానునఁ జేయి వూని తమకంబునఁ బాదయుగంబు దొట్రిలన్. 119

చ. అనిమిషరాజనీలలలితాలకతాళకపువ్వుదోఁటకుం
జని నునుపోఁకబోదియలచాయలకప్పుదిన్నెలన్ వినూ
తనలసలీలతాలలలతావులపూఁబొదరిండ్లలోన నిం
పెనయఁగఁ గొంతసేపు మది కేమియుఁ దోఁచక సంచరించుచున్. 120

సీ. అడుగుఁ గస్తురివ్రాఁడి చుఱుక్కన నాట గండుఁగోయిలరొద గుండె లదర
మోముఁదమ్మిని దేఁటిమూఁక జుమ్మున మూఁగఁ గన్నులఁ గిపురంబు గప్పుకొనఁగ
నుడుగనిజలుగాడ్పు వడల నెమ్మెయి గంద చిలుకపలుకులు బెట్టు చెవుడుపఱుప
మరునితూపులమాడ్కి విరులు పైపై రాల విలసితామోదముల్ వెగటుమాపఁ

తే. దగిలి యచ్చోట నిలువంగఁ దరముగాక, బెగడి దిగులున వేవేగ మగిడి చెలులఁ
వెగడివచ్చినఖల మిటుల్ నెగడె నంచుఁ, జంచలించుచు నృపతనూజాత యపుడు.

తే. చెలువ చెంగల్వకొలఁకులకెలన వలపు, గులుకుపూఁదేనెసోనలు చిలుకుచున్న
తలిరుజొంపంపులేమావితరులనడుమ, మేలికపురంపుఁదిన్నెపై మేను సేర్చి. 122

ఆ. ఏమిసేయుదాన నికఁ జలింపక పిక, ప్రతతి గూయఁదొణఁగె రామరామ
మరునిచేతివెతలు హరహర ఘనమయ్యె, శ్వసనుఁ జేఁచదొణఁగెఁ జక్రధరుఁడ.

క. అలికీరశారికాదులు, చెలిమి యొకింతైన మదిని జేర్పక యకటా
చెలఁగి రొదసేయఁదొణఁగెను, బలుమఱు నిప్పు డంచుఁ దెగడి పలికెన్ దానిన్.

క. చలమా నీ కిటు మధుకర, కులమా వలమానకీరకోకిలశారీ
బలమా తలమా మలయా, నిలమా మము నేఁచుటేమి నీకున్ ఫలమా. 125

క. పదమానసిక ధృతిసం, పద మానుపఁ దలఁచి నీదుపద మాపదకా
స్పద మానటుపాడెద్దు మ, ట్పదమా పదమా సువర్ణపదమార్గమునన్. 126

శా. తాపోద్రేక మొనర్పకున్న నిజవిద్యాభంగమా భృంగమా
కోపాటోపముఁ జూపి యేఁచెదవు నీకున్ వైరమా కీరమా
పాపం బెన్నక సాధుకోటి నలయింపం గోరికా శారికా
కాపట్యం బిఁక మాను మన్యభృతమా కాదంబసంఘాతమా. 127

తే. అనుచుఁ దనచుట్టుఁ గ్రమ్మి గయ్యాళితనము లలరఁ జెలరేఁగి కడుహంసావళి యొనర్చు
చెఱకువిలుకానిబలములఁ దఱిమి పలికెఁ, గలికి మదిలోన వగల నాక్రాంత యగుచు.

చ. ఉసురసు రంచు వేసరిలు నూరుపుగాడ్పుల నించు నూరకే
కసరుకొనున్ దిశల్ వెదకుఁ గన్గవమూయు విధిం దలంచు సా
రసదళనేత్రు నెన్నఁడు తిరంబుగఁ గాంచెద నంచు నెంచు వి
క్కసమగు మన్మథానలశిఖావిసరంబులఁ గ్రాఁగి లోఁగుచున్. 1:9

తే. మఱియు గుఱిలేని విరహార్తిఁ బొరలుచుండి, యంబురుహపత్త్రనేత్రు డెందంబునందు
సకలసంతాపశాంతిహేతుక మటంచు, హరిపదధ్యానలాలస యగుచుఁ బలికె. 130

ఉ. గోపవధూకుచప్రచురకుంకుమసంకుమదాదికాధికో
ద్దీపితముల్ నవీనతరదీధితిజాలవిశాలరత్నసం
స్థాపితహేమనూపురవితానఝుణంఝుణరాగశోభన
ప్రాపకముల్ ముకుందమృదుపాదసరోరుహముల్ దలంచెదన్. 131

చ. అరుదుగ రాధికాకిసలయాధరఁ గూడి కళిందనందనీ
పరిసరమంజుకుంజగృహభాసురపల్లవతల్పకల్పిత
స్మరసరసక్రియావిహితచాతురిఁ గేరెడువల్లవీమనో
హరునివిలాసవైఖరు లహర్నిశమున్ బ్రణుతింతు వేడుకన్. 132

సీ. నవమోహనాకారు నతజనమందారు తరలముక్తాహారు దురితదూరు
సౌవర్ణమయవాసుఁ జంద్రికానిభహాసుఁ గరుణారసోల్లాసు ఘనవిలాసు
ముఖకాంతివిజితేందు మునిమనోబ్జమిళిందు సూరిజనానందు సుగుణబృందు
వికచసారసనేత్రు సకలలోకపవిత్రు సతతసజ్జనమిత్రు నుతచరిత్రు

తే. నరితమోహంసుఁ గేకిపింఛావతంసు, హరిమణిశ్యాము వనమాలికాభిరాము
నసురకులభంగు గోపకన్యాభుజంగు, మహితబృందావననిశాంతు మదిఁ దలంతు.

మ తళుకుంబంగరుబొంగరా లనుచు నాత్మం బొంగి కెంగేలఁ దేఁ
గులుకుం బ్రాయపుగొల్లగుబ్బెతలచన్గుబ్బల్ బిగంబట్టి కెం
దలిరుం గైదువుజోదుకేళికిఁ బ్రయత్నం బింపుతోఁ జేయుచుం
బలుచందంబులఁ గేరుచెల్వుని మదిన్ భావింతు నత్యంతమున్. 134

క. కుందనపుటందె లడుగుల, నందంబుగ ఘల్లుఘల్లు రని మ్రోయఁ గడున్
నందయశోదలముందరఁ, జిందులుద్రొక్కెడుమహాత్ము చెలువు నుతింతున్. 135

చ. తన కెన యైనబాలురఁ దార్చుక మెల్లనె గొల్లయిండ్లకుం
జని పెనువెన్నముద్దలు మెసంగుచుఁ జొంగుచు జున్ను మీఁగడల్
దినుచు విశుద్ధదుగ్ధపరిదిగ్ధకళేబరుఁడై వెలుంగువె
న్నుని నవమోహనాకృతి మనోరథసిద్ధి యొనర్చుఁ గావుతన్. 136

ఉ. నల్లనిపల్లవాధరలవారితమోహనిబద్ధబుద్ధిఁ ద
న్వల్లభుఁ గాఁగఁ గోరుచు భవానికిఁ బూజ లొసంగి నీటిలోఁ
జెల్లఁగ జల్లులాడ దరిఁ బెట్టినవల్వలు మ్రుచ్చిలించి సి
గ్గెల్లను గొల్లలాడినరతీశగురున్ మదిఁ బాదుకొల్పెదన్. 137

క. బుద్ధు లెఱుంగక తిరిగెడు, గద్దరి యని తల్లి ఱోలఁ గట్టినఁ గినుకన్
మద్దులఁ దద్దయుఁ గూల్చిన, ముద్దులగోపాలబాలమూర్తిఁ దలంతున్. 138

చ. పదముల నందియల్ మొరయ బల్లిగి బంగరురావిరేక నె
న్నుదుట నటింప మేలిమొలనూలున గంటలు గల్లనంగ నం
గదములు రత్నహారములు కంకణముల్ మణికుండలంబులున్
బొదలఁగ గొల్లగీములను బూని చరించువిభున్ భజించెదన్. 139

తే. అని తలఁచుచుండె నని సూతుఁ డఖిలమౌనులకు నెఱింగించినట్టు లాశుకుఁడు భరత
కులవరేణ్యున కెఱిఁగింప నెలమి నలరి, యవలికథయెల్ల వినఁగోరి యడుగుటయును.

చ. దురితలతాలవిత్ర శశితోయజమిత్ర కృశానునేత్ర సుం
దరతరగాత్ర సంతతబుధస్తుతిపాత్ర తుషారభూమిభృ
ద్వరతనయాకళత్ర నిజదాసజనావనసూత్ర యక్షకి
న్నరనరసిద్ధసాధ్యసురనందితచిత్రచరిత్రవైభవా. 141

పంచచామరము. హరా ధరామరాదరా మురాసురాహితస్ఫుర
చ్ఛరా పరాత్పరా ధరాత్మజామనోహరా పరా
బరాంబరా కిరాతరూపభాసురా సురాసురా
కరాజిరా మరాళరాజకాంతకాంతవిగ్రహా. 142

మాలిని. పురదనుజవిభంగా భూషితోద్యద్భుజంగా
సురుచిరధవళాంగా సూరిచేతోబ్జభృంగా
కరకమలకురంగా కాంతగంగోత్తమాంగా
తరణిశశిరథాంగా దైవవేశ్యాభుజంగా. 143

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజనవిధేయ తిమ్మనామధేయప్రణీతం బైన రుక్మిణీపరిణయం బను శృంగారప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము.



శ్రీనగరాజకుమారీ
మానసకాసారవిహరమాణమరాళా
మానితశౌర్యాంధకర
క్షోనాయకమదవిభంగ కుక్కుటలింగా. 1

వ. అవధరింపుము సూతుండమ్మునిశ్రేష్ఠుల కెఱింగించినవిధంబున శుకుండు పరీక్షిన్న
రేంద్రున కవ్వలికథ నెఱింగింపందొడంగె. 2

తే. అవనినాయక యంత నయ్యలరుఁబోఁడి, తోడిచేడెలు బంగారు మేడలోన
నిందుముఖిఁ గాన కెంతయుఁ గుంది మంది, రాంగణాంతరములనెల్ల నరసి చూచి.

ఉ. అచ్చెరువొంది హా బిసరుహాయతనేత్ర మనోభవార్తిచే
నిచ్చలు గ్రాఁగి శయ్యకడ నిల్వ సహింపక లేచి యొంటిఁ దా
నెచ్చటి కేఁగెనో వెదకరే యని చింతిలుచున్నయంతలో
మచ్చికఁ గీరశారికలు మానినిచంద మెఱుంగఁ బల్కెనన్. 4

క. హరిణీలోచనలెల్లను, సరగునఁ బూఁదోఁట కరిగి చంచలవృత్తిన్
బరికించుచు నొకచో న,ద్ధరణీవరతనయఁ గాంచి తత్తఱ మొదవన్. 5

చ. మునుకొని మేలిచెంగలువమొగ్గలు సంపెఁగబంతులుం గన
ద్వనరుహనేత్రకుం బడిసిపైచి మెడం గురువేరుఁ గట్టి క
మ్మనికపురంపుభూతి యిడి మానసభూతవికారశాంతికై
పనివడి యుగ్రమంత్రములు బాలికప్రోలఁ బఠించి యల్లనన్. 6

మ. అకటా నెచ్చెలులన్ మొఱంగి మకరాంకాభీలబాణావలీ
వికలస్వాంతసరోజవై నయగతుల్ వీక్షింప కీభూమినా
యకదేవేంద్రుఁ దృణీకరించి నిజవంశాచారమార్గంబుఁ గో
రక యీరీతిఁ జరింప నీకుఁ దగునా రాకేందుబింబాననా. 7

ఉ. పుత్తడివంటిమేను వలపుంబలుకాఁకలఁ గ్రాఁగ నీగతిన్
వత్తురటమ్మ ఘోరవనవాటికి మాటికి సాటికన్నియల్

మెత్తురటమ్మ యీగడుసు మేలపుమాటలు విన్నవిన్ననై
చిత్తము దత్తరింప నృపసింహుఁడు గుందుఁ గదమ్మ జవ్వనీ.

క. నిద్దపుఁగెంజిగురాకులఁ, దద్దయు నిరసించునీపదంబులు నేఁ డో
ముద్దియ వనభూములలో, గద్దరివై తిరుగ నెట్టుగా నోర్చెనొకో.

సీ. కుజనులఁ జేరి చొక్కుచు సీధుపానంబు సేయుచుండాలు రీచెనఁటి తేంట్లు
పల్లవచరవృత్తిఁ బాటిల్లుపరపుష్టగుణవికారంబు లీకోకిలములు
వెస ఘనుం జూచి మానసచింతఁ జనెడునిత్యమరాళజాతు లీయంచగములు
విషధరాగమనంబె వేఁడునుఁ గేకలు వెట్టుశిఖండు లీనట్టుపులుఁగు

తే. ఆహాహా యీరీతి ఖేతి యింతైనలేక, నగెడువారల నెఱుఁగక వగలు మిగులఁ
వోగిలి తహతహ నొందుచు దిగులుఁ బూని, తగిలి వనభూములయుఁ జేరఁ దగునటమ్మ.

ఉ. కన్నియ నీకిటుల్ వగవఁ గారణమేమి జగత్ప్రసిద్ధిగా
నెన్నఁగఁ జాలి సర్వశుభహేతువులై తగునీగుణావళుల్
విన్నపుడే యమూద్వహుఁడు విప్రకుమారుని గారవించి నిన్
గన్నులఁ జూచుకోర్కి నధికంబుగ నువ్విళులూరుచుండునే. 11

తే. శుభనిమిత్తంబు లెన్నైన జూడఁబడుచు, నున్న వబ్జాక్షి సంశయం బుడిగి యిఁకను
సంతసం బాత్మఁ బూని వసంతకేలి, సేయుదము లెమ్ము యుద్యానసీమయందు. 12

ఉ. కన్నులపండువై ద్విరదగామిని యామనియొప్పె గొజ్జెఁగల్
బొన్నలు గేదఁగుల్ వకుళముల్ విరవాదులు మొల్లలాదిగాఁ
గ్రొన్ననలెల్లఁ గొల్లలుగఁ గోయుచుఁ గెందలిరుల్ హరించుచుం
దిన్ననికప్పురంపునునుదిన్నెలఁ జిన్నెలఁ గ్రీడసేయుచున్. 13

తే. తేఁటులను బాఱఁదోలి పూఁదేనెఁ గ్రోలి, లీలఁ జెలరేఁగి తీఁగెటుయ్యాల లూఁగి
పాఁదిఁ జెట్లెక్కి తియ్యనిపండ్లు మెక్కి, మేలిపెంగల్వబావుల నోలలాడి. 14

క. వనకేలి సేయ నుచితము, వనరుహదళనేత్ర రమ్ము వైళంబని యా
య్యనుఁగుంజెలు లాడిన నా, య్యన మది నంగీకరించి యతిసలుఁ దానున్. 15

ఉ. గుత్తపుఁగంచెలల్ దొడిగి క్రొమ్ముఁడు లిమ్ముగ దిద్ది నిద్దపుం
బుత్తడిమేలిసొమ్ము లిడి పొందుగ నందెలుగట్టి గందముల్
మెత్తి మణుంగుఁబావడలు లీలధరించి వసంతకేలిపైఁ
జిత్తము లత్తుకొల్ప మదసింధురయానము లుల్లసిల్లఁగన్. 16

. పువుఁదోఁటలోన నప్పు డభి, నవకౌతూహలము వెలయ నరనాథతనూ
భవచెలులఁ గూడి మెలఁగుచు, భువనోజ్జ్వలతరవిలాసములు గనుఁగొనుచున్. 17

. పోటి యాల్ల నె తగ మగతేఁటిపేటి, పువ్వుమొగ్గలపై వ్రాలి పొదలుచున్న
దవు బళా రాజసుత యిట్లఘూరిసదు, మోవిచివురునఁ బల్గంట్లు లీవి నుంచు. 18

క. పున్నాగముతోఁ బెనఁగుచు, నున్నది లతకూన చూడు ముగ్ధలి యానా
పున్నాగముతో నిటువలె, నెన్నఁగ లతకూన పెనఁగె దీవున్ గోర్కెన్. 19

చ. కనుఁగొను మివ్వనస్థలిని గామిని మాధవసంగతంబునం
దనరునఖాంకురాంకము లనం దగి మోదుగుమొగ్గ లొప్ప నా
జనవరపుత్త్రి యిట్లె సరసం బగుమాధవసంగతంబునం
దనరునఖాంకురాంకములు దట్టము మీఱుచు నీయురస్స్థలిన్. 20

చ. పలుమఱుఁ జంచరీకతతిపై వితతంబుగ మొల్లక్రొవ్విరుల్
జలజలరాలుచున్నవి విశాలతరేక్షణ చూచితే బళీ
బళి నృపకన్య నీతుఱుముపై సుసీమహాపత్త్రనేత్రుఁ డి
మ్ములఁ జెలరేఁగి యాక్రియనె ముత్తియపుందలఁబ్రాలు వోసెడిన్. 21

క. తళతళ మెఱయుచు నవచల, దళపల్లవ మలరెఁ గాంచుతరుణీ యానీ
గళమునఁ గుందనపున్మం,గళసూత్రం బిట్లు చక్రి గట్టుఁ గుమారీ. 22

చ. శ్రమకణముల్ హరించుచు విశాలతరవ్యజనంబు వీచుచుం
దమునఁ జలించుచున్నది యనంటిదళంబు లతాంగి చూడు భూ
రమణకుమారి యా నిటులె రాగముతోడ సువర్ణతాలవృం
తము విసరున్ మురారిసురతశ్రమవేళ నీకు నిచ్చలున్. 23

తే. చానరో మేనఁ బూదేనె సోనవాన, చిలుకుచున్నది లేమావి చిత్తగింపు
మేలు భోజతనూజ నీమేన నిట్లు, వలపుగులుకంగఁ బన్నీరుచిలుకుశౌరి. 24

ఉ. తోరపుమల్లెపూఁబొదలు దూఱి ముదంబునఁ గీరదంపతుల్
గేరుచు సారెకున్ సరస లీలలనుండెడిఁ జూడు బోటి యా
శౌరిని గూడి ముత్తియపుసౌధములందు మనోజలీలలం
గేరుచు నుందు విట్లు పరికింపఁగ నీవును రాజకన్యకా. 25

తే. అనుచుసరసోక్తులాడుచుఁదనదుమదికి,హర్ష మొదవించుచున్నయయ్యనుఁగుఁజెలుల
గారవించుచు మఱియు శృంగారవనవి,హార మొనరించుచుండె నొయ్యార మొప్ప.

ఉ. అప్పుడు కొప్పు విప్పి జడలల్లి సితోత్పల ముంచి పేరెదం
దప్పక గొప్పమొల్లవిరిదండలు నించి విలాసవైఖరుల్
గుప్పలుగాఁగఁ గెంజివురుఁ గొమ్మకరంబునఁ బట్టి నెమ్మెయిన్
బుప్పొడిపూసి కేరెఁ బువుఁబోణి యొకర్తు గిరీశుపోలికన్. 27

ఉ. సారసగంధి యొర్తు విరసంబున గేదఁగిమీఁది తేఁటులం
బాఱఁగఁ దోల నయ్యళులు పైకొని డాకొని మోముదమ్మికిం
జేరినఁ గేలినీరజముచే నదలించినఁ బోకయున్న వే
సారుచు దానిపై నలిగి చంపకముల్ వెదచల్లె జల్లునన్. 28

ఉ. తొయ్యలి యోర్తు మల్లికలు ద్రుంపఁగ మారునితూపు లవ్విరుల్
గొయ్యఁగ రా దటంచును సఖుల్ వచియించిన మానకున్నచోఁ
జయ్యనఁ బూఁబొదన్ వెడలి షట్పద మొక్కఁడు ఝుమ్మురన్న దా
నయ్యెడఁ బర్వువెట్టె గుసుమాస్త్రిధనుర్గుణరావలోలయై. 29

తే. సుందరి యొకర్తు మోమెత్తి చూడఁ జంప,కంబు పూచిన నది యాసుమంబు లేరు
తఱి నొకతె మాన్పె నివి తేంట్లకురుఁటంచుఁ,బలికెఁ బగవారిపగవారుబంధులగుట.

చ. కిసలయపాణి యోర్తు మదిఁ గేరుచుఁ జొక్కపుఁగోఁగుఁ జూచి యిం
పెసఁగ నయోక్తు లేమొ వచియింప వెసన్ సుమనోవికాసలా
లస యగుచుం జెలంగి మరలం బ్రియభాషణముల్ వచించెఁ ద
త్ప్రసవమరందపానరతబంభరడింభరవోత్కరంబులన్. 31

తే. సకియ యొకతె యశోకభూజంబుఁ బూని, తన్ను నది పూచి క్రొన్ననల్ తత్పదాబ్జ
ములపయిని రాల్చెఁ దాడనంబులకుఁ జాల, జడిసి యోపదకాంతులసవతుగాకొ. 32

క. మధురోష్ఠి యొకతె పుక్కిటి, మధు వోసఁగిన నలరి పొగడ మధురసధారల్
పృథుమతిఁ గాంతాళులకుం, బ్రథితముగా విందు లిడియె భక్తిన్ మగుడన్. 33

చ. నలినదళాక్షి యోర్తు నగినం గని క్రొన్ననలెత్తి పొన్న భా
సిలెడుమరందబిందువులు చిల్కఁగఁ జూఁగె గయాళి యిట్లు దన్
జులుకఁగఁ జూచి నవ్వె ననుచున్ మది నెంతయుఁ గుంది ముగ్ధచే
ష్టలు వెలయంగ దా నపుడు సాత్త్వికభావము పూనెనో యనన్. 34

తే. అంబుజానన యొకతె గానంబుసేయఁ, గడువికాసంబు నొంది ప్రేంకణపుఁదరువు
సుతి యొసంగె నవీనప్రసూనవిసర, లీనసదలీనసంతానతానములను. 35

క. తరుణి యొకర్తు కవుంగిటఁ, దరుణిం గదియించి దోహదక్రియ దెలుపం
బరితోషబాష్పకణములు, మఱిమఱిఁ జిలికించె సాంద్రమకరందమిషన్. 36

తే. మానిని యొకర్తు తిలకపుమ్రానిపైని, లీలమీఱ నపాంగమాలికలు నించి
యలరఁ జేసినదానిపై నసమకుసుమ, నికరములు మాలికలు గాఁగ నించె నపుడు.

ఆ. కేలు నంటి యోర్తు లాలింపఁ బ్రస్ఫుటా, మోదరసవికాసమున రసాల
పాదపంబు దనరి పలుమాఱు సహకార, మై ప్రియాళులకుఁ బ్రహర్ష మొసఁగె.

తే. రాజముఖి యోర్తు సిందువారంబుపైని, మేలివల్తావి యూర్పుఁదెమ్మెరలు నింప
నలరి యది మేను పులకించినట్లు సాంద్ర, కుసుమవిసరాభిరామమై కొమరుమీఱె.

క. మఱియుం గిసలయపాణులు, కర మొప్పఁగ నోళ్లు గట్టి గట్టిగ సుమనో
హరణోన్ముఖులై తమలో, సరసవిలాసానులాపచాతురి మెఱయన్. 40

రగడ. చెలువ చెలువగు తేఁటిపాటలు చేరి చేరికొనాలకింపకు
వలదు వలదుపవనసమీరము వడల వడలఁగ నిచ్చగింపకు

మేలుమేలు లతాంగి కడుదుమ్మెదలె మెదలెడుపొదలు దూఱెను
చాలుచాలుగ నున్న బాలరసాలసాలము లెక్కఁగోరెదు
గుప్పుగుప్పున వాసనలఁ బైకొంచు కొంచునుగాక గాత్రము
గప్పు గప్పురపుందుమారము కదలి కదలిచినంతమాత్రము
వామవామకరంబుచే లతవంచి వంచితబుద్ధితో నన
లేమిలేమిటు పసురునొగ్గలె యేరియేరినిఁ జూడ నీనన
గరముఁ గరమున నలరుతమ్మిమొగడలు గసులుగఁ జాఁపి యేపునఁ
దెఱవ తెరవడి జోపెదవు పూఁదేనెఁ జేనెటు లోదవుఁ గోపునఁ
దనరు తనరుచి యంతకంతకుఁ దరము దరమును మదినిఁ జేరుచు
నునుప నునుపగు మొగలివిరి నీకొప్పుకొప్పున నలుపుమీఱుచు
మాను మానుముఁ బోఁకబోదెలు మెఱసె మరువేశ్మస్థలం బగుఁ
జాన జానగునెనలు గోయఁగఁ జాగి జాగిపుడేఫలం బగుఁ
బొగడ పొగడఁగఁ దగిన దిఁక నీబోఁటిబోటికి దీనిసుమములు
తగవె తగవె మజ్గొండుపొదలకుఁ దాటి దాటి దొలంగుక్రమములు
పూని పూనిలువెల్ల నలిచినపొన్నపొన్నలచెంత కరుగుట
మాని మానిని మేలె యిచటనె మట్టిమట్టియ లఱుగఁ దిరుగుట
తేరె తలరెడువిరులు దొరకినదాఁక దాకఫలంబు లేఱకె
యలసి యలసికతాపయంబులయంద యందఱు నుంటి రూరకె
రమణి రమణీయంబుగాఁ గలరవము రవము చెలంగె మాటికి
ప్రమదప్రమదము మీఱఁ బైకొని బహులబహులలు ద్రుంపనేటికి
సారసారససౌరభము వెదచల్లఁ జల్లనికొలనిచెంతను
మీరి మీ రిపు డలవికెల్ల శమింప మింపనుటేమివింతను
ఎన్న నెన్నఁడు నెఱుఁగ మిటు పరువేల వేలతరంపుఁబువ్వులు
కన్నె కన్నెఅనేసి కోపము గ్రమ్మ గ్రమ్మఁ జనెదుదవ్వులు
క్రింది క్రిందిగ రాదు యీకంకేలికేలికి విరులఁ బొందుగ
నందనంద మె బడలు టోగజయాన యానగ మెక్కి ముందుగ
మధుపమధుపవనాదులను బగమాన మానసమున నుతింతమె
మధురమధురసకుసుమములు పలుమాఱు మారున కిడి భజింతమె. 41

వ. అనుచుఁ బసిగలననలెల్ల నపహరించి, మంచిసరములు గూర్చి ధరించి కొన్ని యించువిల్కానిఁ బూజింప నెంచి యుంచి, చంచలేక్షణ లానందజలధిఁ దేలి. 42

స్థలజలజవ్రజంబులఁ బదంబులకును నవగంధఫలంబులచే నాసలకును
పొన్న క్రొన్ననలచేఁ బొక్కిళ్ళకును శిరీషమ్ములచేఁ బాహుశాఖలకును

మొగలి రేకులచేతఁ దగ నఖంబులకును గురువిందగుత్తులఁ గుచములకును
గుంపజాలములఁ జెల్వొందుదంతములకు నుదుపుష్పముల నధరోష్ఠములకుఁ
తే. బూని వనలక్ష్మి యాముద్దుఁబువ్వుఁబోండ్ల, యవయవములకు నోడి యత్యంతభక్తిఁ
దవిలి సేవించె ననఁగ నుద్యత్ప్రసూన, భూషణాలంకృతాంగులై పొల్చి రపుడు.
ఉ. అంత వనంబు వెల్వడి సుధాంశుముఖుల్ జలకేలి సేయ న
త్యంతకుతూహలం బొదవి యందఱు నొక్కకొలంకు డాసి యా
చెంత విభూషణంబులను జేలలఁ బ్రోగులువెట్టి నిద్దపుం
గాంతులు మీఱుపావడలు గట్టి చలం బెడఁ బుట్టి దట్టలై. 44
చ. ప్రకటముఖభ్రమద్భ్రమరపంక్తులు నీలపుఁజాలనేలనం
ఘుకములు మేఖలల్ దొరయఁ దోరపుమందగతుల్ చెలంగ దా
మకుచకుంభముల్ పొదల మత్తిలి తమ్మికొలంకుఁ జొచ్చునే
నికరములో యనంగఁ దరుణీమణు లుల్లము లుల్లసిల్లఁగన్. 45
క. గుబ్బలబంటిజలంబుల, గొబ్బునఁ జొరఁబాఱి యాచకోరేక్షణ లా
గుబ్బగఁ గొలను గలంచుచు, నబ్బురపాటొదవ నోలలాడుచుఁ జేర్కన్. 46
చ. ఒకగజరాజగామిని మహోత్పలపత్రవిలీనబంభర
ప్రకరముఁ బాఱఁదోల నవి పైఁ దలనిద్దపుమోముఁదమ్మి ను
త్సుకమునఁ జేరి నాసఁ గని సొంపగుసంపఁగిమొగ్గ యంచు నొం
డొకదరిఁ జేర డెందముల నుబ్బి కనుంగొని రంగనామణుల్. 47
చ. కిసలయపాణి యొక్కర్తు జలకేళి యొనర్పఁగఁ జన్నుదోయి సా
రసముకుళద్వయం బనుచు రాగముతో నొకచక్రవాకి వె
క్కసముగ ముక్కునం బొడిచి కామినిమోము సుధాంశుఁ డంచు సా
ధ్వసమునఁ బర్వువెట్టి తనవల్లభుఁ జేరెఁ జెలుల్ హసింపఁగన్. 48
చ. లలన యొకర్తు దోయిట జలంబులు ముంచి యిదేమిబోటి యి
జ్జలము వసంతమై యలరుచంద మటన్న గయాళి యౌనె నీ
లలితకరాబ్జరాగ మిటులం బ్రసరించె నటంచుఁ బల్కఁ దాఁ
గిలకల నవ్వె జవ్వనులు గేలి యొనర్చి రనేకభంగులన్. 49
క. ప్రకటేందిందిరయుతమై, వికసించిన తెల్లదమ్మివిరిఁ గన్గొని యం
దొకయహిరోమావళి దాఁ, బెకలించె సలాంఛనేందుబింబం బనుచున్. 50
ఉ. అంబుదవేణి యొక్కర్తు కలహంసములన్ బెదరించె శీతరు
గ్బింబనిభాస్య యొక్కర్తు వెతఁ బెట్టుచు వీడఁగఁ దోలెఁ జక్రవా
కంబుల నున్మదద్విరదగామిని యొక్కర్తు హరించెఁ బద్మసం
ఘంబులఁ జంపకప్రసవగంధి యొకర్తు మథించెఁ దేఁటులన్. 51

తే. అతివ లందఱుఁ గమలోత్పలాదికములు, గోయుచుండిన నం దొకకోమలాంగి
మొనసి కెందామరలఁ గేల ముట్టదయ్యె, నుత్పలములు నిరీక్షింప నొల్లదయ్యె. 52

చ. పదువు రొకర్తెఁ బట్టుకొని పద్మపరాగము మీఁదఁజల్లుచుం
జెదరక యోలయోల యని చేతులతాళము లూని కొట్టుచుం
గొదగొని కేలిసేయ నది గొబ్బున నీట మునింగి లోననే
కదిసి యొకర్తె పాదములు గట్టిగఁ బట్టుక యీఁదె మీఁదికిన్. 53

తే. కోకిలాలాప యోర్తు చీకాకుసేయఁ, బల్లవాధర యొకరామ పజ్జ నీఁదె
మత్తగజయాన యోర్తు చెయ్యెత్తి మొత్త, మరలి రంభోరుహారిమధ్యమునవ్వుచొచ్చె.

చ నలినదళాక్షి యోర్తు బిసనాళము చిమ్మనఁగ్రోవి చేసి య
మ్ములి నొకకొమ్మమీఁద దనపుక్కిటినీరముఁ జల్లి నీటిలో
పల మునిఁ గన్వలన్ వెడలెఁ బైకొని దానికచం బటంచు శై
వలలత పట్టి లాగి మఱి వంచన నొందె వధూటి విన్ననై. 55

సీ. కుచచక్రవాకముల్ కచచంచరీకముల్ ప్రపదకచ్ఛపములు బాహుబిసము
లాననపద్మంబు లంఘ్రిపల్లకములు కటిసైకతంబులు గళదరములు
దరహాసఫేనముల్ దంతకేసరములు చారురోమావళి శైవలములు
నాభికావర్తముల్ నయనోత్పలంబులు వరవళీవీచికావ్రాతములును

తే. దనర సరసులు నుతిసేయఁ దగువిలాస, సరసులము మేము మాకు నీసరసి యెట్లు
సాటి యగు నంచు నిరసించుచందమునను, గరటియానలు కొలనెల్లఁ గలఁచి రప్పుడు.

తే. ఇట్లు జలకేలి యొనరించి యిందుముఖులు, సరసి వెల్వడి మెల్లనే దరికిఁ జేరి
కుండలేంద్రతనూభవకుంతలముల, నొడలుఁ దడియార్చి పెద్దకొ్రమ్ముడి ఘటించి. 57

చ. జిలుఁగుమణుంగుదువ్వలువ చెల్వుగఁ గట్టి పసిండిమేలుసొ
మ్ములు వెసఁ బెట్టి క్రొమ్ముడిని బువ్వులదండలు చుట్టి గుబ్బలన్
గలప మలంది నెన్నుదుటఁ గస్తురినామము దిద్ది ముద్దుగు
మ్ములు సాబ గేర్పరించి సుషమంబుగఁ దారు నలంకృతాంగులై. 58

క. భోజతనూజం దోడ్కొని, రాజసమున వనికి నరిగి రాజీవాస్త్రుం
బూజింపఁ బూని యొకచో, రాజితసహకారభూజరాజులనడుమన్. 59

సీ. బలుకప్పురపుటనంటుల నంటఁ బ్రాఁకినపరువంపుద్రాక్షపందిరులదరుల
మేటిగొజ్జెఁగనీటియేటిజాలునఁ జాలఁ బ్రబలినచెంగల్వబావిక్రేవ
నుడివోనితావు లీనెడుమరందపువాన జానైనసంపెఁగమ్రానిక్రిందఁ
బొదలెడుగురువిందపూఁబొదరింటిలో సొగసుఁజందురురాలజగతిమీఁద

తే. దళుకుగేదంగిఱేకులదళ్కుగట్టి, కలువకెందమ్మివిరులమేల్కట్లమర్చి
కమ్మపూఁదేనె చిల్కి సాంకవము పూసి, లీలఁ బుష్పొడి రంగవల్లికలు దీర్చి. 60

తే. కెందలిరుసెజ్జ రచియించి యందు నొక్క, మేలికదళీదళంబుపై మృగమదమున
సుమశరుని వ్రాసి వామభాగమున రతిని, నిలిపి క్రేవలఁ దద్బలంబుల లిఖించి. 61

సీ. అలరుగొజ్జెఁగనీట నభిషేక మొనరించి చంపకజాలకాక్షతలు నించి
క్రొన్ననసరముల జన్నిదంబులు వైచి మొగిలిరేకులచేలములు ఘటించి
గమగమవలచుసాంకవగంధ మర్పించి కుసుమభూషణము లిం పెసఁగ నొసఁగి
కర్పూరధూపంబు నేర్పున నలరించి పద్మరాగంపుదీపములు వెట్టి
తే. హరిమధురసఫలవిసరాదికోష, హార మిడి వీడె మర్పించి హల్లకంబు
తేర్చి నీరాజన మొనర్చి నేర్చినట్లు, పుష్పబాణాసనునిఁ గూర్చి పూజసేసి. 62

ఉ. దండము నీకు భూరిభుజదండవిమండనమండితేక్షుకో
దండవిముక్తచండతరదారుణసూనశరాహృతామితా
జాండకరండమండలనిరంతరజంతువితానమానసా
ఖండలధీరతాగుణజగన్నుతకీరశకుంతవాహనా. 63

ఉ. అంబురుహాంబకాయ చలితామితమానికదంబకాయ హే
మాంబరనందనాయ జగదర్పితసంతతనందతాయ నీ
లాంబుధరోషమానసముదగ్రతనుద్యుతిహారిణే నమ
శ్శంబరవైరిణే యనుచు జాఁగిలి మ్రొక్కి నుతించి రందఱున్. 64

సీ మిన్నంది యేప్రొద్దు మెలఁగుచుండెడితేరు తియ్యనై రస ముప్పతిల్లు విల్లు
పువ్వుఁదేనియ లాని క్రొవ్వి మ్రోయుగుణంబు సొగసుఁదావులనీటు చూపు తూపు
ఫలవితానము మెక్కి పలుకుచొక్కపుజక్కి యున్నతాగమరూఢి నుండు దండు
పట్టిమ్రాఁకులు చివుర్వెట్టఁజేయుసఖుండు భువనాంతరక్రీడఁ బొడము సిడము
తే. నలరు జగదభిరామువిహారి యగుచు, మగల మగువల వలపించి మదిఁ గలంచి
కూర్పఁ గలనేర్పు నీకె చేకూరె నౌర, మహితశృంగారసారరమాకుమార. 65

క. యేరీ నీసరి సరసవి,హారీ శూర్పకమదప్రహారీ హారీ
శారీశుకపికగణసం,చారీ భువనోపకారి శంబరవైరీ. 66

క. పంకరుహాసన వాసవ, శంకరులును నీయమోఘసాయకములకున్
శంకాతంకము నొందుదు, రింకెంతని నీప్రతాప మెంతుము మదనా. 67

క. తోరముగ నిను భజింపఁగ, నేరము నీరేజబాణ నీ విఁకఁ గరుణా
సారముచే నేలు నమ,స్కారము లివె షోడశోపచారంబులకున్. 68

చ. పలుమఱు దెప్ప నేటికి నృపాలతనూభవ కంసవైరితోఁ
జెలిమి యొనర్చినప్పుడె పసిండిగృహంబున ధూపదీపస
త్ఫలరసగంధపుష్పముల భాసిలుకప్పురపున్ విడెంబులం
జెలఁగుచు మన్మథోత్సవము సేయుఁ జుమీ సరసీరుహాంబకా. 69

తే. శంబరేక్షణ యని విరోధంబు వలదు, విమలకమలాక్షి యీమహీరమణతనయ
పంచముఖమధ్య యనుచుఁ గ్రోధించవలదు, సమదహరిమధ్య యీబాల జలచరాంక.
తే. అనుచు నతనుని నుతిగొని యతనిసతిని, రతినిఁ బ్రతిదినసౌభాగ్యవతినిఁ బొగడి
తద్బలంబులఁ బ్రార్థించి తలిరుఁబోఁడు, లింపు దళుకొత్త నృపపుత్త్రికిట్టు లనిరి. 71
క. అలివేణీ వలఱేనిం, గొలిచి కడున్ వశునిఁ జేసికొంటిమి మదకో
కిలకీరశారికాదులు, చలమున నిఁకఁ గీడొనర్పఁజాలవు సుమ్మీ. 72
చ. అదనునఁ దోఁటలోఁ గలలతాంతములెల్ల హరించి భక్తితో
మదనునిఁ బూజచేసి పలుమాఱుఁ బ్రసన్నతఁ గాంచినారమే
కొదవయు లే దికన్ మదిని గుందక నందకపాణిఁ జెందెదో
మద్దకలహంసయాన పదమా ముద మాని నివేశసీమకున్. 73
చ. అని మనుజాధినాథతనయన్ వినయంబుగఁ బల్కి వేగదో
డ్కొని వనితల్ నిశాంతమునకుం జని కంజనిభాస్య కింపునం
దనరుమృదూక్తులన్ శ్రుతిహితం బొనరించుచుఁ జిత్రలీలలన్
మునుకొని చిత్తవృత్తికిఁ బ్రమోదము సేయుచు నుండి రంతటన్. 74
క. వరుణవధూటీకుచతట, పరిశోభిత మైనకెంపుఁబతకము దీప్తుల్
నెరి నుర్విఁ బర్వె ననఁగాఁ, బరఁగెం జరతారుణాతపంబులు పేర్మిన్. 75
చ. అనుపమవైఖరిం గువలయప్రియుఁడై తగురాజుఁ బట్టబ
ద్ధుని నొనరించువేళకును దోయధినీరముఁ దేఁ దలంచి సొం
పున నపరాశయన్ సుదతి ముంచినమేల్మిపసిండిబిందె నా
దినమణిబింబ మస్తగిరిదిగ్వనరాశిని గ్రుంకె నత్తఱిన్. 76
తే. పాంథతతిమీఁద వలరాజు బలసి దండు, వెడలుచును మున్నె యెత్తింప విజయధాటి
నమరుకెంబట్టుటెక్కెంబుగమి యనంగ, డంబుమీఱుచు సాంధ్యరాగంబు మెఱసె
తే. అరయఁ దమిఁజేరి రాజకాంతాళిఁ గరఁచు, శ్వేతరుగ్భావితునిరాక చిత్తవీథి
నిలిపి పద్మిని ముకుళించె నెమ్మొగంబు, వెతలఁ గుందుచుఁ జక్రముల్ వీడఁదొడఁగె.
ఉ. తృష్ణ జెలంగ జక్కవలధీరత మింటఁ దలంకుచుండె న
త్యుష్ణమరీచి యంచు నిను నొల్లక వాసరలక్ష్మి శైత్యవ
ద్ధిష్ణుని రాకఁ గోరి తమఱేనిఁ బయోనిధిఁ ద్రోచె నంచు న
ద్విష్ణుపదంబు పట్టుకొని వేమఱునున్ మొఱవెట్టుకైవడిన్. 79
చ. విరహుల గెల్వఁ బూని సరవిం బికషట్పదకోటి నంతరాం
తరములఁ గాపువెట్టి వితతంబుగ మారుఁడు విశ్వరూప మ
చ్చెరువుగఁ దాల్చెనో యనఁగఁ జీఁకటి లోకములెల్ల నిండెఁ ద
త్కరపరిముక్తకుంధవిశిఖంబు లనన్ దివిఁ బర్వెఁ దారకల్. 80

సీ. మారుండు విరహిణీసారసాక్షుల నేయఁబూనినకెందమ్మిపువ్వనంగ
యామినీగజరాజగామిని మోమునం బొదలుకుంకుమచుక్క బొట్టనంగ
హరిదరుణాధరమరునకు నారతిఁ బట్టినహేమంపుఁబాత్ర యనఁగ
వాసవరాణి విలాసార్థముగఁ గేలఁ దాల్చినశోణరత్నం బనంగ
తే. సమయకింకరుఁ డుదయాద్రి జగతిపతికి, సరవిఁ బట్టినపగడంపుటరిగ యనఁగ
నఖిలజనులకు లోను సాహ్లాద మగుచు, నిందుబింబంబు ప్రాగ్దిశ యందుఁ బొడమె.
తే. అతులశోభావిభాసితం బగుచు గగన, మహిఁ జిగిర్చినగుజ్జులేమావి యనఁగ
నుడుపబింబంబు వెలుఁగొంద నడుమ నప్పు, డలరె నంకంబు గండుఁగోయిల యనంగ.
తే. సరసమై వసుగంధిని స్తంద్ర మగుచు, నురుతరంబుగ ఘనమార్గయుక్త మగుచుఁ
దోరమై సకలామయహారి యగుచు, నొనరె నెంతయుఁ బూర్ణచంద్రోదయంబు. 83
క. అంబరతలమున శశధర, బింబము విలసిల్లె ధవళదీప్తుల నంతం
బంబయి సలాంఛనం బగు, శంబరతారణునివిజయశంఖం బనఁగన్. 84
సీ. గగనగేహంబు ముక్తామార్ణమున నభశ్చరభామినుల్ వెల్లచలిచి రనఁగ
సమయన ర్తకుఁ డింద్రజాలంబు చూపుచు వెలిపుట్టముల తెర వేసె ననఁగ
రజనీవధూటి నీరజవైరిఁ గూడి యానందించి పకపకనవ్వె ననఁగ
విబుధు లర్చనసేయువిష్ణుపదంబునఁ దనరుసితాబ్జబృందం బనంగ
తే. విరహిణుల రేఁచి పాంథుల వెతలఁ ద్రోచి, కోకముల నేఁచి తిమిరంబుగుహలడాఁచి
కమలములఁ గ్రాఁచి మదచకోరముల బ్రోచి, యలరెజగములసాంద్ర చంద్రాతపంబు.
చ. శమనునిదుంతఁ బట్టుకొనె శక్రుఁడు దావెలిమేనుఁ గంచు వే
ద్రమ్మునఁ బుర్రారి నంది యని గాదుపునెచ్చెలిఘేఁకపోతుపైఁ
దమకముమీఱ నెక్కె నలధాతకుమారుని నెమ్మిఁ గాంచి హం
సముగఁ దలంచె సాంద్రతరచంద్రిక లోకములెల్లఁ గప్పటన్. 86
చ. తమము నితాంతశైవలము తారలు సారసితారవిందముల్
కమలవిరోధిహంసము కలంకము పంకము చంద్రికాకదం
బము నురువుల్ హిమంబు శతపత్రమరందముపై నభఃస్థలం
బమరెఁ గొలంకుచందమున నయ్యెడ సత్కవివర్ణనీయమై. 87
క. అన్నిబిడపువెన్నెలఁ దమ, కన్నులఁ జెన్నమరఁ జూచి కన్నెలు నెలరా
గిన్నెల నాసవ మిడి పలు, చిన్నెలఁ బానంబు సేయఁ జెలఁగిరి వేడ్కన్. 88
క. మదిరాక్షులార రారే, మదిరాపానంబు చేసి మతి యందమునన్
మది రాగిలి క్రీడింపుద, మదిరో యప్రాప్యవస్తు వచ్చెం జేతన్. 89
క. వాసవముఖసురనికరము, లాసవ మొక్కింతకంత యానినమతి తా
థాసవనాశంబులపై, నాసపహింపుదురె యెటుగఁ రై. రది యట్లమున్. 90

ఉ. కుందనపుంగలంతికలుఁ గోరలు నుంచి యొకర్తొకర్తకున్
విందులు సేయుచున్ సొలసి వీనులు మూయుచు గ్రుడ్లు ద్రిప్పుచున్
గందము లిచ్చగించుచును కందువపల్కులఁ గేరి నవ్వుచుం
జందనగంధు లయ్యెడను సాత్త్వికభావములన్ మెలంగుచున్. 91

చ. గరిత యొకర్తు హేమచషకంబునఁ జందురునీడ చూచి హా
వెఱవక గిన్నెలో నిఱికి వీఁడు హరింపఁగఁ జాగె సీధువే
నెఱవగుదొంగఁ బట్టుకొని నేఁడు మొదల్ పదియాఱు వ్రక్కలై
ధరఁ గృశియింపఁ జేతు నని దబ్బరలోన మథించెఁ జేతులన్. 92

క. వలిదెమ్మెర మెల్లనె యొక, చెలిపయ్యెదకొంగు దొలఁగఁ జేసిన నది యం
జిలి బయలు గౌఁగిలించెం, జెలఁగి తనహృదీశుఁ డిట్లు చేసె నటంచున్. 93

చ. కలికి యొకర్తు చంద్రికలుగాయ శశాంకునిఁ జూచి యోయి వె
న్నెలదొర బావ నన్నుఁ గని నీ విపు డేటికి నవ్వె దూరకే
నిలునిలు నేను ని న్నగఁగ నేరనె క్రమ్మఱ నంచుఁ బల్కి తా
నెలమిని మోరయెత్తి యిహిహీ యని నవ్వె మదంబు పెంపునన్. 94

క. చెలి యొకతె తనదుమదిరా, కలశంబులు గొనఁగ నీకుఁ గారణ మేమే
తులువ యని యొకతె గురుకుచ, కలశంబులు పట్టి లాగె గ్రద్దతి యనుచున్. 95

సీ. సఖులార కుమ్మరసారెతీరున భూమి తిరిగె నంచును గేలు ద్రిప్పె నొకతె
చుక్కలన్నియుఁ జేరి సుర యెత్తుగొనిపోయె నంచు నూరక పల్వరించె నొకతె
వలరాచబావ మే న్గిలిగింతగొలుపక తలతల యని పూని పలికె నొకతె
రాజ నాతో సాటి రాదు రంభ యటంచు వేడుకతోఁ బాత్రలాడె నొకతె
తే. పెక్కుదెఱఁగుల నిటువలెఁ జొక్కుచుండి, రపుడు నృపపుత్త్రి విరహార్తి నలసి సొలసి
నింగి నంటి వెలింగెడు సిరజారిఁ, గాంచి తమకంబు మించి నిందించఁదొణఁగె. 96

చ. అకట నిశాటపాంథనివహంబుల నేఁచుఖలుండ వౌట నిన్
సకలనిశాచరారి యగుశౌరి యెఱింగియుఁ బూని కాచె నీ
వకలుష మైనయవ్విధుసమాఖ్య ధరించుటఁ జేసి త్రుంపఁ జా
లక తనవారివాఁ డని తలంచియొ లోకులదుష్కృతంబునన్. 97

తే. కువలయాహ్లాదకరుఁడవై కొమరుమీఱు, రాజ వని నిన్ను ద్విజనికరంబు లెపుడు
ప్రణుతిసేయరగే నహహ యిబ్భంగి నీకు, వలదు చక్రాహితత్వంబు వనజవైరి. 98

క. సిరితోఁ బుట్టినమాత్రనె, సుసగుణం బెలఁ గల్గు చంద్రా నీ కా
సిరితోఁ బుట్టియ కాదే, సరసుల నేచుచు నలక్ష్మి జగతిం దిరుగున్. 99

ఉ. రాజ నటంచుఁ జక్రముల రాపులఁ బెట్టుచునుండి రేలు ని
ర్వ్యాజకుఁడ నంచు విష్ణుపద మంటినఁ బోవునె దుష్కృతంబు నీ

రేజవిపక్షు నిన్ జిలువఱేఁడు వడిం గబళించుఁగాక నీ
యోజఁ జరింతు వంచుఁ గద యొల్లదు పద్మిని నిన్నుఁ గన్గొనన్. 100

తే. తుహినకరశూలి నిను గురుద్రోహి వగుటఁ, దనమది నెఱింగియును లింగధారి వనుచు
నెత్తి కెక్కించుకొనుటకు నీకు నబ్బుఁ, దని యతనివైరి మరుఁ గూడ నర్హ మగునె.

క. హరికిన్ ముద్దుమరందివి, సిరికిం దమ్ముఁడవు విశాలశీతాంశుఁడవున్
హరునకుఁ దలపువ్వుబంతివి, తరుణుల నలయింప నింకఁ దగదు శశాంకా. 102

క. తామసిని గూడి యకటా, వేములుఁ బద్మినుల జాల వెతఁబెట్టెదు నీ
వేమిటిరాజవు చెప్పుమా, శ్యామలపక్షం బొకింత సైపవు చంద్రా. 103

సీ. జడభావమున రేలఁ గడువడిఁ దిరుగుచు నొకతఱి నంబరం బొల్లకుండి
చెలఁగి యెప్పుడును రిక్కలతోనె లోకమ్మై శుచిరుచుల్ సగ మెక్కుచో నెఱుఁగక
తమ్ముల కెంతయుఁ దలవంపులుగఁ జేసి కువలయం బెలమిఁ గన్గొని హసింపఁ
గొంకక గురునకుఁ గీడొనర్చుచు మది మలినలక్షణమున వెలయుచుండి

తే. వరుసతోఁ బున్నమకు నమవసకు నెల్ల, జగము లెఱుఁగంగ నెక్కుచు దిగుచునుండు
కళకలుగ నీకు మఱి వివేకంబు గలదె, విరహలోకాపకారి పంకరుహవైరి. 104

మ. మకరాంకుండు విజృంభమాణుఁ డగుఁ బ్రేమం గృష్ణపక్షంబునం
దకటా యెప్పుడుఁ గృష్ణపక్షమున నీ వార్తిం గృశం బొందు వే
మొకమాటన్ మఱి మీకుఁ జెల్మి యలరెన్ ముఖ్యానుకూలంబుగా
సకలంబున్ వివరించి చూడుము శశీ సర్వజ్ఞచూడామణీ. 105

శా. నీవు న్నేమును గ్రీడ సేయుదుము పూన్కిం జాళువామేడపై
భావింప న్మను పిన్ననాఁడు గనకాభాతిన్ హితం బయ్యె మా
త్రోవన్ రాకుము వద్దు వద్దిఁకను నీతోఁ జెల్మి పల్మాఱు నుం
గావింపం గొఱగాదు నీ కొకనమస్కారంబు తారాప్రియా. 106

క. అని వనితామణి యిటు ల, వ్వనజారిం దూరి చేరి వైరముమీఱన్
ననతూపు లేయుమరునిం, గినుక మదిం బొడమి యదలకించుచుఁ బల్కెన్. 107

క. మరుఁడా విచలితసకలా, మరుఁడా గరుడాసనునికొమరుఁడా సుమతో
మరుఁడా విరహులపై వే, మరు డాయఁగ రాకు కూర్మిరమతి పామరుఁడా. 108

క. నేర మొకింతయు నెన్నక, కేరుచు వేమాఱు నూరకే తెరువరులన్
భీరువుల నేఁచు టిది యొక, శూరత్వము గాదు సుమ్ము సుమకోదండా. 109

సీ. పంకసంకరమునఁ బొటిల్లు టెక్కెంబు విషసముద్భవములై వెలయుతూపు
లరయ నెప్పుడుఁ బండ్లు గొఱికెడుగుఱ్ఱంబు కుజనుల నలరింపఁ గోరుసఖుఁడు
ఘనుల దవ్వుగ విడఁగాఁ దోలుసచివుండు మధుపానమదమున మలయుగుణము
ముక్కలై యెండియు మొలచుకన్నులవిల్లు మదిఁ జైత్రలీలలు వెదకుబలము

తే. గలిగి యతనుఁడవై జగంబులకు నెందు, గానఁగారాక మెలఁగుతస్కరుఁడ వీవు
విరహిణుల నేఁచు టిది యెంతవింత తలఁప, నఖిలలోకైకసంచార హరికుమార.

క. పృథివిఁ బరాశరకులని,ర్మథనునితనయుఁడవు నీవు మఱి గుణి వగుదే
వ్యర్థ యగునె యథాబీజం, తథాంకుర మటన్నమాట తాపసవైరీ. 111

తే. తండ్రిపగ మాన్చు టుచితంబు ధరణియందుఁ, దనయులకు నెల్ల నది యబద్ధంబు చేసి
మధువిరోధికి సుతుఁడవై మదన నీవు, మధుసఖుఁడ వౌట యేలాటిమతము చెపుమ.

క. మదమునఁ బొదలుచు నింతయు, నొదుఁగక బ్రహ్మాపరాధ మొనరించినని
కదనున సుదతుల నేఁచుట, మది నరయఁగ నింక నెంతమాత్రము మదనా. 113

శా. లోనం జుట్టమఘోలె వర్తిలుచు నిన్ లోకాపకారానుసం
ధానున్ భస్మము చేసినట్టిప్రమథాధ్యక్షేక్షణోద్యద్బృహ
ద్భానుస్నేహవిహారి యౌ టెఱిఁగియున్ బాటింప కీ వెప్పుడున్
మానం జాలవదేమి గంధవహుదుర్మంత్రాంగ మబ్జాంబకా. 114

తే. విను మనోజాతసద్గుణుఁ డనుచుఁ దనకుఁ, గన్నుగాఁ జూచి తల నిడుకొన్నహరునిఁ
గూడి నిను బొడిచేసినకుముదమిత్రుఁ, డరయ నీకెట్టుగాఁ జుట్టమయ్యెఁ జెపుమ

ఆ. మేనమామ యనుచు మానుము సఖ్యంబు, పరుసగాదు శ్వేతకరునితోడ
నలినబాణసర్వనాశాయమాతుల, యనెడుమాట వినవె జనులవలన. 116

తే. అనుచుఁ దనుఁ జాల వెతఁబెట్టునసమశరుని, నింద గావించిమఱియునయ్యిందువదన
మందగతిఁ జేరి మేనెల్లఁ గందజేయు, గంధవహుఁ గూర్చి పల్కె నాగ్రహముతోడ.

చ. జ్వలనునిచెల్మిచేసి కలుషంబునఁ జిల్వల కునికోటలం
గలవిసమెల్ల రాసికొని గబ్బితనంబున మిన్నుముట్టి నీ
విలఁ బలుమాఱుఁ ద్రిమ్మరుట యెల్లను బాంథకదంబకంబులన్
గలఁచఁగఁ బూని కాక యిఁకఁ గారణ మెయ్యది సోఁకుదయ్యమా. 118

చ. అజపదలీల గాంచి సకలాగమపద్ధతులన్ మెలంగుచుం
గుజనులపండ్లు దుల్చి యధికుం డగుచక్రికిఁ దృప్తిసేయుచుం
బ్రజలకు నెల్లఁ బ్రాణమయి భాసిలుచుండెడినీకుఁ బాంథులన్
వృజినమతిం గలంచుట వివేకము గాదుగదా సమీరణా. 119

ఆ. పవనశశియు నీవుఁ గవగూడి రాజస, మొప్ప మిన్ను ముట్టి యూరకున్న
తెరువరుల నలంచెదరు చక్రధరుఁడు మీ,పని యొకింత గొంచెపఱుపకున్నె. 120

చ. అని వచియించి యామధుకరాలకజాలక మేను మీనకే
తనుఘనవేదనం బొగులఁ దాళఁగఁజాలక లేచి పాన్పుపై
• నునిచినక్రొన్ననల్ గని యయో దయ యింతయులేక మీ కిటుల్
వనజదలాక్షులార నవవహ్నికణంబుల నింపఁ జెల్లునే. 121

క. మార్తాండుఁడు చంద్రేండుఁన్, మూర్తుల నేకీభవించి మునుకొని మింటన్
వర్తించుచున్నవాఁడో, యార్తికి నోర్వంగఁ గలరె యజరుద్రాదుల్. 122

ఉ. అద్దిర గంధవాహుఁడు దవానలకీలలు గ్రుమ్మరించుచుం
దద్దయు మీఱఁగాఁ దొడఁగె దైవసహాయ మొకింత గల్గి వే
సుద్దులఁ కేలు నవ్వులుగఁ జూడక వేడుక నాదరించి యో
ముద్దియలార మీ కిపుడు మ్రొక్కెద నివ్వడగాడ్పు మాన్పరే. 123

తే. పరభృతంబుల కారామగరిమ చూపి, శుకములకు సాంకవము వేసఱక యొసంగి
భ్రమరవితతికిఁ గనకవర్ణంబు నించి, యడుగుకొనరమ్మ రొద మానునట్లుగాను.

క. మధుకరములరొదలకు మన్మధుకరములనలన వెడలు మార్గణములకున్
మధుపరభృతములయానిల, విధుకరముల కోర్వఁగఁగుఁడె విధియైనఁ జెలీ. 125

ఆ. అనుచుఁ గళవళించు నంగనఁ గనుఁగొని, యనుఁగుఁజెలులు విస్మయంబు నొంది
కమలవదన కిపుడు ఘనమయ్యె విరహార్తి, శిశిరవిధులు వేగ జేయుఁ డనుచు. 126

ఉ. క్రొన్ననపాన్పుపై నునిచి గొజ్జఁగనీర్మయిఁ జిల్కి సిబ్బెపుం
జన్నులచందనం బలఁది చారుమృణాళలతావితానముల్
చెన్నుగ బాహుమూలములఁ జేరిచి కప్పురపున్రజంబు వా
ల్గన్నుఁ నూఁది పూవిసనకఱ్ఱల వీచి యనేకభంగులన్. 127

తే. శిశిరకృత్యంబు లొనరింపఁ జెలియ మేన, నింకెఁ బన్నీరు చూత్కార మెసఁగఁ జంద
నంబు వెస బూదియై రాలె ననలుఁ దలిరు,టాకు లెల్లను బొడిపొడియయ్యె నపుడు.

ఉ. అబ్బురపాటునొంది చెలులందఱుఁ గ్రమ్మఱ శైత్యకృత్యముల్
గొబ్బున నాచరించి మదకోకిలవాణి మెయిం దిటంబుగాఁ
బ్రబ్బినతాప మార్చి మృదుభాషల మెల్లనె యుల్ల మెల్ల పె
ల్లుబ్బఁగఁ జేయుచుం దవిలి యొద్ద మెలంగుచు నుండి రంతయున్. 129

క. నరనాథతనూభవ యీ, సరణిం దరుణులును దాను జాగరదశచేఁ
బొరలుచు నుండెడితఱిఁ బుష్కరతలమున వేఁగుజుక్క సరవిం దోఁచెన్. 130

తే. మరుఁడు పగఁ బూని ధారుణీశరతనూజ, నేఁచుచున్నాఁడు వేగ రావే యటంచుఁ
దమకముగ నుగ్రమూర్తి యాదైవమునకు, మొఱయిడినరీతిఁ గృకవాకులఱవఁ దొడఁగె.

క. కులటలు దాఱ ఖగంబులు, కలకలనాదములఁ గేరఁ గలువలు సోఁ డ
వ్వలిదిశకు జాఱ లోకులు, తెలివిం దనరారఁ దూర్పు దెలతెలవాఱెన్. 132

చ. తిమిర మణంగె జక్కవలు ధీరతఁ బొంగె విటీవిటాళికిం
దమకము చెంగెఁ జుక్కలు యథాయథ లౌచుఁ దొలంగె ఖిన్నతన్
గుముదతతుల్ మణింగె మదనుండు శ్రమంబున లొంగెఁ బద్మినీ
సమితి చెలంగెఁ దుమ్మెదలు సంతస మూని మెలంగె నయ్యెడన్; 133

చ. వెలుఁగుల ఱేఁడు తమ్మిచెలి వేడుకకాఁడు తమంబుసూడు చు
క్కలవాగజోడు నిచ్చలును గల్వలరాయుడికాఁడు కోరి మ్రొ
క్కులు గొనువాఁడు జక్కవలఁ గూర్చును నేరుపుకాఁడు ఘనుఁ డు
జ్జ్వలతరదీప్తుల న్మెఱసె వావిరిఁ దూర్పుఁగొండమీఁదటన్. 134
తే. చక్రములు వేడ్క నుప్పొంగ సరసు లలర, నఖిలదిశలఁ దమోగుణం బణఁగఁజేసి
కాశ్యపి భజింపఁ బ్రభమీఱ ఘనపదవినిఁ, జెందియంతంతకును బ్రకాశించె నినుఁడు.
తే. అప్పుడు నృపశేఖరుఁడు సమయార్హవిధులు, దీర్చి సచివాప్తబంధుసుధీపురోహి
తాదులను గూడి విపులశుద్ధాంతమున శు,భోత్సవాసక్తుఁడై వేడ్క నొప్పుచుండె.
క. భేరీకాహళనిస్సా, ణారావము లాకటనింగి యదరఁగ మొరసెం
బౌరులు సాలంకృతులై, భూరితరామోదములను బొంగఁగ నంతన్. 137

చ. ఘనసమరావనీవిజయకారణవారణఘోటకావళుల్
మునుకొని రాఁగ దుందుభులు ముందర మ్రోయఁ జమూసమూహముల్
వనధితరంగమాలికలపై ఖరితో నరుదేరఁ జిత్రకే
తనములు చామరంబులును దద్దయుఁ జెంగటఁ బూని పట్టఁగన్. 138
తే కదిసి యిరుగడ వందిమాగధులు పొగడ, పృథులకాహళశంఖముల్ పెల్లు మొరయ
రుచిరకాంచనమయరథారూఢు లగుచుఁ, జేరి కదరఁ గురురాజకుమారులెల్ల. 139
క. అరుదులుగా మణిమణి తమ, బిరుదులు మెఱయించుకొనుచుఁ బృథివి చలింపన్
గురుతరవైభవములతో, వరుసను దన్నగరమునకు వచ్చిరి కడిమిన్. 140
మ. గజయూథంబులు ధర్మనిర్మితరథాంగంబుల్ తురంగంబులున్
వ్యజనంబుల్ మణిచామరంబులు నవీనాందోళికాడోలికా
ధ్వజముక్తారచితాతపత్రములు నుద్యల్లీలఁ దన్ గ్రమ్ముఁగా
ధ్వజినీనాథులఁ గూడి చేదిపతి తేవన్ వచ్చె నవ్వేటికిన్. 141
చ. సకలవిధంబులన్ గణఁగి చైద్యున కేము విదర్భరాజక
న్యక నొనఁగూర్తు మంచుఁ జతురంగబలంబులతోడఁ గూడి భీ
ష్మకనరపాలు ప్రోలికి వెసం బఱతెంచిరి యుత్సహించి పౌం
డ్రకుఁడును దంతవక్త్రుఁడు జరాసుతసాల్వవిమూరకాదులున్. 142
తే. ఇవ్విధంబునఁ దేజంబు నివ్వటిల్ల, నరుగుదెంచిన మేదినీపతుల నెల్ల
నెదురుకొని పూజ లొనరించి హృదయశుద్ధి, తోడఁ దనరాజధానికిఁ దోడితెచ్చె.
క. ఆజనపతులకుఁ గనకపు, భాజనముల షడ్రసాన్నపానంబులుగా
భోజనము లిడి గజాశ్వస, మాజనవాభరణవసనములు నొసఁగి వెసన్. 144
తే. భాసురావాసములు విడిపట్టు లొసఁగి, భూసురాశీర్వచనరూఢిఁ బొదలి మంద

హాసవికసితవదనాబ్జభాసమానుఁ, డగుచు నుత్సాహంగెఁ గుండిననగరవిభుఁడు 145

తే. అనుచు సూతుఁడు శౌనకుఁడాదియైన, మునులకెఱిఁగించెనంచు వ్యాసునిసుతుండు
విజయపౌత్రునకెఱిఁగింపవినినరేంద్రుఁ, డవలికథయెల్ల వినఁగోరియడుగుటయును.

శా. గౌరీచిత్తసరోజభృంగభువనఖ్యాతాహ్వతానంగక
నీహారాబ్జాకనిభాంగభాసురకరాంభోజాతసారంగకే
యూరీభూతభుజంగదీనసముదాయోద్యత్కృపాపాంగవి
స్ఫారాంభోధినిషంగపుంగళజటాభారాగ్రగంగాపగా. 147

క. దక్షాధ్వరహరసుప, రోక్షాక్షధరక్షీరశర్వయుక్షాధిపగం
ధాధ్వసధ్వగదుర్వహ, గర్వారివిరామపీఠికాపురధామా. 148

మణిగణనికరము సురవరహరినుతసురుచిరచరణా, పురహరశివకరబుధజనశరణా,
నిరగళశశిధరకరతలహరిణా, చిరతరయశసరసిజశరహరణా. 149

మాలిని. కరధృతశూలా ఖండితారాతిజాలా, పరిచితగిరిబాలా భాసురానందలీలా
నిరుపమగుణశీలా నిత్యవిజ్ఞానమూలా, సురజనుతలోలా కుంభిచర్మోరుచేలా.

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజనవిధేయ తిమ్మన నామధేయప్రణీతం బైన రుక్మిణీపరిణయం బనుశృంగారప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.





మత్పీతపురానిశ
ధామజగత్పూజితనామదనుజవిరామా
భూమిధరోత్తమకన్యా
కోమలపదవాజ్జన్మాంగ కుక్కుటలింగా. 1

తే. అవధరింపుము సూతుఁ డిట్లఖిలమౌని, నికరమున కెఱిఁగించినట్లు లావ్యాసపుత్రుఁ
డవలికథయెల్ల భరతకులాధిపునకుఁ, దెలుపఁగాఁ దొడంగి యిట్లని పలికె నపుడు. 2

తే. అవనివరు మున్నె తొలునాఁడు హరిని బిలువ, ననిపుటీషాత్రి యనిచిన యగ్రజన్ము
వర్యుఁ డత్యంతహృదయతాత్పర్యమూని, యాశుగతి ద్వారకాపురి కరుగుచుండి.

మ. చని యవ్విప్రవరుండు గాంచె నెదుటం జంబీరమందారచం
దనమాకందకదంబనింబవకుళద్రాక్షాలతాధారముఙ్
ఘనకంఠీరవఘోరవేభహరిణీగంధర్వసంచారముఙ్
మునిసందోహవిహారముఙ్ మధురఝుంకీపూరంబుఁ గాంతారముఙ్. 4

సీ. శుకభరద్వాజకౌశికవరద్విజసభాభవనమై నైమిశాటవివిధమునఁ
శక్రరంభాపారిజాతకైరావతఖ్యాతమై నాకలోకంబుకరణి
భైరవపంచాస్యభద్రేభముఖశివాసేవ్యమై కైలాసశిఖరిపగిది
నబ్జచక్రఖగేంద్రహరిసత్కమలాకరంబై వికుంఠపురంబు మాడ్కి
తే. నలరుహిమజలమధురఝుకీలలసితాగ్ని, పులినవలి నాస్తికలనాప్రభూతఘుష్మ
సలిలసంసిక్తభిల్లయోషాప్రియాఢ్య, కానుమోదకమారుతం బద్వనంబు. 5

తే. పద్మినులఁ గూడి సంభోగపరవశమునఁ, దనరుపున్నాగనికరసత్తములయందు
భోగినులఁ గూడి హృదయానురాగమున భుజంగపతిజాలమచట నుప్పొంగుచుండు.

సీ. కరులు మేఘములు శీకరకదంబము వాన కీచకధ్వనులు భేకీరవములు
చెంచుముద్దియలమేనిసిరులు మెఱుంగులు మణిఘృణుల్ హరిధనుర్మంజరులు
చమరికావాలసంచలనముల్ పవనముల్ పృదులసాంకవమృగిమదముబురద
కపురంబునురువుసింగపుబొబ్బ లుఱుములు హిమజలపూరము మంచు పెనఁగునడవి

తే. హరినఖరదారితోన్మదద్విరదకుంభ, గళితముక్తావళుల్ వడగండ్లగములు
గాఁగ వర్షాగమంబు వైఖరిని దనరు, నవ్వనస్థలి దాఁటి యాత్యాశుగతిని. 7

చ. చనిచని ధారణీవిబుధచంద్రుఁడు ముందర డెంద ముబ్బఁగాఁ
గనుఁగొనె నక్రకర్కటకకచ్ఛపమత్స్యవ్యపదర్దురోద్రమున్
ఘనతరరత్నజాలపరికల్పితభద్రము నిర్మలోర్మికా
నినదకదంబసంతతవినిద్రముఁ బశ్చిమదిక్సముద్రమున్. 8

ఉ. ధీవరకోటి కెప్పుడు నదీనము చేర ఘనుల్ వసించినన్
జీవన మిచ్చు ధన్యుఁడు ప్రసిద్ధి వహించినబాడబాశ్రయుం
డావనరాశిభూసురున కర్ఘ్యముఁ బాద్య మొసంగె నూర్మికా
పావనసీకరబిందువులు పాదయుగంబునఁ జిల్కరించుచున్. 9

క. వేలావలదేలాము, జాలాఖిలసుమసమూహసౌరభలహరీ
లీలాకులబాలానిల, మాలావిలసనము లార్యుమది నలరించెన్. 10

చ. ఉదధిమహారవంబు లపు డుర్విసురాధిపుఁ డాలకించి తా
మదిఁ దలఁచెన్ యదూద్వహునిమందిరదేశమునందు ముందుగా
సదమలదుందుభిధ్వనులు సాగెఁ గదా శుభసూచకంబులై
కొదవ యిఁకేమిలేక సమకూరెఁ బ్రయోజన మంచు నుబ్బుచున్. 11

చ. తరువిటపిప్రసూనకలితభ్రమరారవముల్ సుగీతముల్
పటుతరఘూర్ణితధ్వనులు భవ్యమృదంగనినాదముల్ సము
త్కటజలపక్షిరావములు కాంస్యపుఁదాళములై చెలంగఁగా
నటన మొనర్చుమానిను లనం దగి వీచిక లొప్పె నీరధిన్. 12

తే. హరిహయునివజ్రధారకు వెఱచి యమిత, వాహినీనాథుఁ డంచు నవ్వారిరాశి
యండఁ జేరక నిల్చినకొండ లనఁగ, నిసుకతిన్నియగములు సొం పెసఁగె నచట.

క. సందరమున నురు వలరె ము,కుందుని పెండ్లికిని బిలుచుకొఱ కరిగెదు భూ
బృందారకుఁ గన్గొని యా,నందంబున నప్పయోధి నవ్వె ననంగన్. 14

తే. మీనవృశ్చికకర్కటమిథునమకర, హరివృషాదులు రాసులై యలర నుడుప
తరణు లిందులఁ జరియించుటరుదె యనుచు, నెంచె దైవజ్ఞమణియామహీసురుండు.

ఉ. వాలికమీఁదఁ బట్టుచు నవారితకౌతుకలీలఁ దేలుచో
మేలగుగుబ్బచన్నులమీఁదిపయంటలు జాఱి యున్నతేఁ
జాఱిముద్దుగుమ్మలకుచంబులు బంగరుచెంబు లన్న దిం
జాలఁగ నిచ్చఁ గన్గొనియె ఛాందసుఁ డజ్జలరాశిచెంగటన్. 16

సీ. బహుతరవాహినీపరివృతుం డయ్యును గడు నిబ్బరముగ భంగంబు నొందె
ఘనులకు జీవనం బొసఁగూర్చుచుండియు సంతతంబును గలుషత్వ మూనెఁ

దవిలినమర్యాద దాఁటక యుండియుఁ బరిపరివిధముల భ్రమ వహించె
ద్విజసమూహముల కఠినమై యుండియు బాడబార్తిఁ గృశింపఁ బాలు వడియె
తే. గటకటా దైవ మెటువంటిఘనులనైనఁ, గట్టిఁడితనంబుచే వెతఁ బెట్టుచుండు
నంచు రత్నాకరునివిధం బెంచె నపుడు, పండితశ్రేష్ఠుఁ డైనయాబ్రాహ్మణుండు. 17
క. ఇతఁడే కమలావాసుఁ, డితఁడే తథ్యము సరస్వతీశుఁడు నితఁడే
క్షితి నబ్జాంకుఁ డటంచున్, గృతి నెంచెఁ ద్రిమూర్తులుగ సుధీవరుఁ డుదధిన్. 18
క. అని మది నెంచుచు భూసుర, తనయుఁడు వేవేగ నరుగుతఱి మార్గమునం
బున నొకచోఁ గనుఁగొనె శో,భనరైవతకాచలంబుఁ బ్రమదము మీఱన్. 19
సీ. అభ్రాపగాహాటకాబ్జపరాగసంఛాదితాఖిలరత్నసానుతలము
కిన్నరకన్యకాగీతరావామోదకటకచరద్విపౌకశ్చయంబు
మండితోన్మత్తవేదండతుండోద్గీర్ణశీకరధారాభిషిక్తభూమి
హర్యక్షమృగయావిహారలంపటకిరాతాహృతఘోరగుహాంతరంబు
తే. ఘనమునీంద్రోత్తమాశ్రమవనరసాల, సాలకిసలయఫలరసాలోలబాల
శారికాకీరకోకిలచక్రరావ, హారినినదంబు రైవతకాచలంబు. 20
సీ. ఘనులకెల్లను దానకం బగుధీరుండు ప్రతిదినకల్యాణభాసమానుఁ
డురుఫలంబులు విప్రవరులకు నిడుదాత హరి గజద్వేషుల కాకరంబు
కోరి వంశోద్ధారకుం డగుచతురుండు గోత్రవర్గములోన గురుతరుండు
పరవాహినులు చెందు వెఱవనియచలుండు కలితాగమస్థితి నలరుమేటి
తే. యాధరాధరుఁ డవనీసురాగ్రగణ్యుఁ, గాంచి కలరవరుతసూక్తిఁ గదియఁ బిలిచి
పూజ గావించె సరసమహీజకుసుమ, విసరములు మీఁద రాల్చి సంతసము మీఱ.
మ. ప్రకటైరావతపారిజాతతరురంభాశక్రహేమాహ్వతా
దికసంశోభితమై సమస్తసుమనస్తేజస్సదామోదమై
యకలంకం బగుదేవతానగరిచాయం బోల్చి భూభూమిభృ
త్ప్రకరోత్తంసము విప్రవర్యునకుఁ జేతఃప్రీతి చేసెం గడున్. 22
సీ. నానాప్రసూనప్రలీనోన్మదాళీనతానమానములు గీతములు గాఁగ
చారుమారుతపూరితోరుకీచకనినాదములు చొక్కుపుట్టుపాంగములు గాఁగ
ఫలరసకిసలయాస్వాదలోలుపఖగధ్వానముల్ కంచువాద్యములు గాఁగ
ఘనదరీతలఝరీకల్లోలమాలికాధ్వనులు మృదంగనాదములు గాఁగఁ
తే. గేరి నటియించుసరసమయూరికాక, దంబములు నర్తకులు గాఁగ డంబుమీఱ
కొలువుసేయుధరాధీశుచెలువు చూచి, సంతసం బందె నయ్యగ్రజన్ముఁ డపుడు.
చ. తనులతలు న్నితంబము లుదగ్రపయోధరముల్ ప్రవాళశో
భను గనుపట్టుమోవులును భాసురగండములున్ మణిద్యుతుల్

ఘనగజయానముల్ భ్రమరకంబులు సత్కలకంఠనాదముల్
దనరఁ జెలంగుసానులవిలాసము చూచె బుధేంద్రుఁ డుబ్బుచున్. 24

తే. వినుతపుఁ బండువయ్యె నహీనమైన, వీనమధుపానపీనకులీనసూన
లీనసదలీనసంతానతానమాన, మానగంబున ధరణీసురాన్వయునకు. 25

తే. నాగకదలీకదంబపున్నాగసాల్వ, రోహితక్షశివాదులఁ బ్రోచు మఱియు
నాగకదలీకదంబపున్నాగసాల్వ, రోహితక్షశివాదులఁ బ్రోచు నద్రి. 26

ఉ. ఫుల్లసరోజలోచనలు పింఛపటంబులు గట్టి గట్టుపైఁ
బెల్లుగఁ గ్రీడసేయ శశిబింబనిభాస్యలచన్నవల్ విరా
జిల్లెడునిమ్మహం బ్లనుచుఁ జేరి కనెం బ్రభువర్యునార్థమై
యుల్లమునందు నమ్మహీసురోత్తముఁ డుబ్బి హరింపఁ గోరుచున్. 27

సీ. నీలకంఠాకృతి నెఱిఁ బూని యానందతాండవం బాడుశిఖండితతులు
రామనామం బజస్రముఁ బఠించుచును సత్ఫలవాంఛ నలరెడుచిలుకగములు
సరసాగమస్థితు లరయుచుఁ గృష్ణలీలలఁ గేరుచుండుకోకిలకులములు
సుమనోభిరూఢిచేఁ జొక్కి మన్మథగురుసేవ సేయుమధువ్రతావలులును

తే. బరమహంసస్వరూపంబు సరవిఁ దాల్చి, ప్రస్ఫుటదబుద్ధిఁ జెలఁగుమరాళములును
గల్గియుండెడుచో వేఱె తెలుప నేల, యన్నగంబు మునిశ్రేణికాకరంబు. 28

తే. సదములాహీనకటకుఁడు చంద్రధరుఁడు, నీలకంఠోల్లసితుఁడు మానితప్రహాంకుఁ
డఖిలసుమనోవినుతపాదుఁ డగునతండు, విశ్రుతముగ గిరీశుఁడై వెలయు టరుదె.

ఉ. ఆనసుధాశికంబున విహారము చేయుచుఁ జూచె నొక్కచో
భూవిబుధాగ్రగణ్యుఁడు విభూషితశేషభుజంగమున్ జగ
త్పావనకారణాంగము నపారకృపారచితాంతరంగమున్
దైవభుజంగముం గపటదైత్యవిభంగము శంభులింగమున్. 30

ఉ. కాంచి తదీయమూర్తిఁ గుతుకంబున డెందమునందు నిల్పి యా
క్రాంచనగర్భవంశమణికాంచనకుండకుఠంటకాదికా
న్యంచితసూనబిల్వదళపక్వఫలాదులచేతఁ బూజ గా
వించి దృఢానురాగమున వేఁడెఁ దొడంగె ననేకభంగులన్. 31

చ. జయజయ పార్వతీశ శివశంకర భూరిసమిద్భయంకరా
జయజయ నీలకంఠ పురశాసన వంచితనీరజాసనా
జయజయ దేవదేవ హరిసాయక నిత్యశుభప్రదాయకా
జయజయ లోకనాథ సురచారణయక్షమునీంద్రకారణా. 32

దండకము. శ్రీమద్గిరీశాయ, ధీమత్పరీశాయ, కాశాబ్జభేశారుగాశాద్వధపాకాశగంగా
సరిల్లోల కల్లోల మల్లీశరస్మేరదాళీ మరాళీ సుధాపూర కర్పూర పాటీర డిండీర

వాగ్భామినీహార నీహార హీరాభదేహప్రభాశాలినే, శూలినే, శంభవే, దంభవే దండ
దైత్యాజినచ్ఛాదితోద్యత్కటీరస్థలోద్భాసినే, శైలసంవాసినే, వాసవాబ్జాసనో
పేంద్రచంద్రోరగేంద్రాదికామర్త్య హేమావతంసాంచలాబద్ధ సుస్నిగ్ధహీరావళీ
ధాళధళ్యప్రభాపూర నీరాజితాంచత్పదే, వారితోగ్రాపదే, తాపసవ్రాతచేతస్సరో
జాత సంకేతసంచారలీలావిలోలప్రమత్తాళయే, రాజరేఖామయూఖోల్లసన్మౌళయే,
శైలకన్యాపయోధరోజకుంభద్వయీలిప్త సంవ్యాప్తదీప్తాంగ రాగాతిసౌరభ్యసంవా
సితస్ఫారదోరంతరాళాయ, సంగ్రామకేళీకరాళాయ, రంగజ్జటాజూటకూటస్థఝూళం
ఝుళాలాప ధావద్వియద్వాహినీజాత సజ్జాతరూపారవిందాఘమారందపూరామితా
నందలీలాచలద్భృంఝరీ యూధమాధుర్యసంగీత నాదానుమోదాయ, శశ్వత్ప్రసాదా
య, పాదాంగదీభూత వాతాశనాధీశ భోగాగ్రభాగోల్లసత్పద్మరాగోపలోద్దామ
భాభాసమానాయ, సంరక్షితాశేష విద్వద్వితానాయ, నానాసరోజాతగర్భాండ
భాండచ్ఛటాపాట వాక్ఛ్రాంతపూర్ణోదరానందినే, కేతనాగ్రస్ఫురన్నందినే, చంద్ర
కందర్పకోట్యర్బు దామంద సౌందర్య రేఖాంగసమ్మోహితానేకలోకాయ, సంవీత
శోకాయ, పాకారినీలోపలాస్తోక శోభావిభాస్వద్గళాగ్రస్థితాభీల కాకోలనీలప్రభా
జాల సంవ్యాపినే, విద్విషత్కోపినే, భూపయఃపావకాకాశ యజ్వేందుభాస్వన్మ
రున్మూర్తయే, చారుసన్మూర్తయే, చంద్రచంద్రాతపాదభ్రసంశుభ్ర విభ్రాజితస్నిగ్ధ
భూత్యంగరాగాయ, గాఢానురాగాయ, వీతోగ్రతాపాయ, హేమాద్రిచాపాయ,
సోమాబ్జమిత్రాగ్నినేత్రాయ, సంస్తోత్రపాత్రాయ, సర్వాఘవల్లీలవిత్రాయ, సారార
విందాక్షబాణాయ, వారాశితూణాయ, వేదప్రమాణాయ, నిర్మూలితారాతిప్రా
ర్వామరానీక పూర్వప్రదీప్తప్రతోళీవిటంకావళీజాలకీసాలశాలా విశాలాంతరాళింద
వేదీ మహాసౌధసోపానవాతాయనశ్రేణయే, హారిసారంగశాబస్ఫురత్పాణయే, సం
తతోద్యత్స్వసామర్థ్యలోకత్రయస్థాణవే, స్థాణవే, బాణదైతేయభక్తత్రాణసంస
క్తచేతోంబుజాతాయ, లోకప్రపూతాయ, శీతోర్విభృద్బంధవే, సత్కృపాసింధవే,
బంధురానందసంధాయినే, దీనగేహాంగణస్థాయినే, శిక్షితాఖర్వగర్వాంధకారప్రసూ
నోజ్జ్వలత్కేతనే, విశ్వవిశ్వంభరాభారధౌరేయతాహేతవే, కైతవస్వాంతయుక్తాం
తక ద్వీపిదైత్యప్రహారాయ, వీరాదివీరాయ, విజ్ఞానమూలాయ, విఖ్యాతశీలాయ, ద
క్షాధ్వరధ్వంసనాత్యుగ్ర రౌద్రప్రతాపాయ, సత్యానులాపాయ, దేవాదిదేవాయ,
దివ్యప్రభావాయ, సంగీతసాహిత్య నృత్తాభిధానప్రవీణాయ, వైవస్వతప్రాణ
సంహారణోజ్జృంభమాణాయ, దూరీకృతాంభోజసంభూతగర్వాయ, శర్వాయ, తు
భ్యం నమస్తే నమస్తే నమః 33

క. ఘనమేశ నీస్వరూపము, సరసిజగర్భాదులకును సనకాదులకుం
గుఱుతుగఁ దెలియఁగ రాదఁట, ఘనఁ బ్రాకృతజనుల కెట్లు తెలుపగు నరయన్.

క. జగములలో నీ వుందువు, జగములు నీయందు నుండు సర్వము నీమూ
ర్తిగ భావించి మెలంగెడు, సుగుణుల కెప్పుడును నీవు సులభుఁడ వీశా. 3

తే. ఊరిడెప్పురు గల్ల వేళల బురదలోనె, పొరలుచుండియుఁ బంకంబుఁ బొందనట్లు
జ్ఞాని యగువాఁడు సంసారసంగుఁ డగుచు, నెందు నేనియుఁ బంకంబుఁ జెందఁ డనఘ

చ. కలలసమస్తవస్తువులు గాంచినఁ దథ్యము గానికైవడిన్
మెలఁగుప్రపంచ మంతయును మిథ్య యటంచుఁ దలంచి యాత్మయం
దలరఁగ నిన్నుఁ గన్గొనుమహాత్ములు నిత్యవిభూతిఁ జెంది ని
శ్చలసుఖలీలఁ జెందుదురు సారతపోధనలోకకారణా. 37

ఉ. జ్ఞానవిహీనమానవుఁడు శాస్త్రము లెన్నియొ తింగినన్ మిముం
గానఁ డొకించుకేనియును గాసర మేక్రియ విద్య నేర్చినన్
మేను మఱంతదొడ్డయిన మిక్కిలి నేరుపు విస్తరిల్లఁగా
మ్రాసెగఁబ్రాఁకి పండ్లు దినుమార్గ మెఱుంగునె చీమకైవడిన్. 38

తే. జలఘటాదులయం దబ్జసారిసాస్త, బింబములు పెక్కులగుచుఁ గాన్పించుభంగి
నిక్కముగ దేహములకు నాత్మ యొక్కఁడయ్యుఁ, బెక్కు దెఱఁగులఁ గనఁబడుఁ బ్రథివనీశ.

క. కర్మములఁ దవిలి కొందఱు, నిర్మలపరసౌఖ్య మెఱుఁగ నేరక యెపుడున్
దుర్మతిఁ జెడుదురు వారల, కర్మంబుల కేది మేర గలదు మహేశా. 40

తే. అనుచుఁ దన నేర్చు తెఱఁగున నఘవుఁ గొల్చి, యచ్చోటు దొలంగి యరుగుచు నందునందు
వింతలెల్లను గనుఁగొని సంతసిలుచు, ద్వారకాపురి వేవేగఁ దఱియఁ జేరి. 41

క. ధరణీసురాగ్రగణ్యుఁడు, పరమానందమునఁ గాంచె బహుతరమణిగో
పురమున్ వైభవజితగో, పురమున్ బావనవిభేదిపురముం జెంతన్. 42

ఉ. కాంచి పురంబుఁ జేరి మణికల్పితశిల్పకచాతురీకశా
భ్యంచితసౌధయూధరుచిరాకరసారరథాదికంబులుం
గాంచనగోపురంబులు సుఖప్రదవిప్రధరేశగేహముల్
కాంచనగర్భవంశమణికస్థలమందువుగాఁగఁ జూచుచున్. 43

సీ. నీలజాలకజాలనిష్క్రాంతకాళికఘనసారధూపవాసనలచేత
నిరతభరతకళాపరవారయువతీమృదంగసంగీతనాదములచేత
నానాప్రసూనగంధానుసంధానసమాగతగంధవాహములచేత
జంద్రశాలాప్రదేశస్ఫురజ్జలయంత్రపతితశీకరకదంబములచేత

తే. ద్వారతోరణకుముదకల్హారసార, సారసామోదవస్తులచేత ధరవరుఁడు
మార్గగమనప్రభూతశ్రమంబు దీఱి, యుల్లమున నొల్లముగు వేడ్క లుల్లసిల్ల. 44

సీ. ముఖహోమనిఖిలాగమప్రణాదములచే భాసిల్లుభూసురావాసములును
గరఘోటకాందోళికాశతాంగములచే వెలుఁగొందుభూభృన్నివేశములును

నవరత్నధనధాన్యవివిధవస్తువులచే బలితంబు లగువైశ్యభవనములును
గోశాకవ్యరోష్ట్రిసంకులములై సిరులచేఁ బొదలుచుండెడుశూద్రసదనములును
తే. సతతన ర్తితన ర్తకీజనసరత్న, కనకమంజీరఘంటికాధ్వనులచేత
వలను మీఱెడుబహువేశవాటికలును, జూచి యుప్పొంగె ధారుణీసురవరుండు.
తే. శంఖవరనీలసుందకచ్ఛపముకుంద, మకరపద్మమహాపద్మనికరములను
దనరునీరాజధానితో ధనదునగరి, సరి యగునె యంచు నవ్విప్రవరుఁడు పొగడె.
తే. కేల గిరి యెత్తువరబలశాలి యగుటఁ, జేసి పేరైనపర్వతశ్రేణులెల్ల
లీలఁబెకలించితెచ్చియీప్రోలఁగోట, యిడెనొహరియంచుబుధుఁడెంచెనిభకులము.
క. బంధురగతి నిచ్చోటున, గంధర్వావళుల నీనఁగాఁ బోలుఁ జుమీ
సింధువులకా కెటు లబ్బెన్, సైంధవనామంబు లంచుఁ జర్చ యొనర్చెన్. 48
తే. కమలజావాస మెప్పుడు గలిగియుండు, విబుధలోకంబు నిబిడమై వెలయుచుండు
నాగవాసంబు మున్నె యిన్నగరి వలరు, నౌర పౌరుల కిఁక నొండు గోరవలదు.
క. అని తలఁచుచుఁ జని భూసుర, తనయుఁడు వేడుకలు మీఱ దైత్యారినికే
తనభూమిఁ జేరి యొయ్యనఁ, దనరాక యదూద్వహునకుఁ దగ నెఱిఁగించెన్. 50
చ. విని హరి నీలవర్ణుఁ డరవిందభవాన్వయుఁ డోడితెం డటం
చును దగువారలం బనుప సూరిజనోత్తముఁ జేరి వార లం
దనము లొనర్చి మిమ్మిపుడు దానవసూదనుఁ డాదరించి గొ
బ్బునఁ బిలుఁ డంచుఁ బంచె నృపపూజిత రమ్మిఁక నంచుఁ బల్కినన్. 51
తే. శౌరిఁ గన్గొనుభాగ్యంబు సంభవించె, నంచు నెంతయు సంతసం బాత్మ నలర
వారితోడ నెయవ్విప్రవరుఁడుకాంచ, నాంబరునిమందిరముఁజొచ్చియరుగునపుడు.
సీ. క్షీరవారాశివీచిక లంచు మది నెంచు హీరసోపానంబు లెక్కుచోటఁ
బ్రావృణ్ణనాఘనపంక్తు లంచుఁ దలంచు హరినీలభిత్తికల్ దఱియుచోటఁ
గ్రతుభుగ్గిరాధరకటకంబు లని యెంచుఁ గనకవితర్దికల్ గాంచుచోట
నప్పూతకాసారంబు లని యాత్మ నూహించు విధుశిలాతలములు వెలయుచోట
తే. నహికులేంద్రఫణాగ్రంబు లంచు నెంచు, నబ్జరాగకవాటంబు లలరుచోట
సాంద్రచంద్రాతపము లంచు సరవి నెంచు, విపులముక్తికసౌధంబు లమరుచోట.
సీ. పగడంపుగుంభ్రగంబములు బాజుల నిల్పి పన్నినముత్యాలపందిరులును
వరహరిన్మణిమయద్వారతలంబులఁ బాటిల్లుహీరకవాటములును
దతపుష్యరాగనిర్మితవిటంకములచే వెలయుక్రొన్నెలరాలవేదికలును
జకచకద్యుతులఁ గొంచక చెలంగి వెలుంగు మేలినీలపుఁగుడ్యజాలకములు
తే. నబ్జరాగశిలావలికాంచలప్ర, లంబనవనవరత్నకదంబరుచిర
కనకసౌధాదికంబులు గడచి మిగుల, మోదమున రాజశుద్ధాంతమునకు నరిగి. 54

చ. కలకలనాదము ల్సెలఁగఁ గంసవిరోధికథాప్రబంధముల్
పలికెడునూత్నరత్నమయపంజరసంశ్రితకీరశారికా
వలులవినోదవైఖరి యవారితకౌతుకహేతుభూతమై
యలరఁగ సద్ధరామరకులాంబుధిచంద్రుఁడు కోరి చూచుచున్. 55

తే. పఱపుగలపట్టివెళ్ళచప్పరము లొరసి, మేటిపన్నీటివాఁగులు మించి మించి
కప్పురప్పుటనంటిబోదెలఁ గలయనలచు, చలువచెంగల్వకేదారములును గడచి. 56

సీ. అభినవపద్మరాగాశ్మకవాటముల్ చారుహరిన్మణిద్వారములును
బటుపుష్యరాగసంఘటితార్గళంబులు లాలితహరినీలజాలకములు
భూరిశోభాపూర్ణహీరసోపానముల్ విపులచంద్రోపలవేదికలును
రుచిరగోమేధికప్రచురవలీకముల్ విలసితవైడూర్యవలభికలును

తే. సాంద్రముక్తాఫలామలచ్ఛాదనములు, పృథులజాంబూనదాబద్ధభిత్తికలును
గలిగి దేదీప్యమానమై వెలుఁగుచున్న, భవ్యతరచంద్రశాలికాభ్యంతరమున. 57

చ. అపరిమితప్రసూననిఖిలాగరుజాపకసౌరభంబులుం
గపురపుధూపవాసనలుఁ గస్తురిగంధములున్ జవాదిని
ద్దపుపలుకుల్ బుగుల్కొనెడుదట్టపుదట్టుపునుంగుఁదావులున్
విపులగతిం దిగీశులకు విందు లనింద్యముగా నొనర్పఁగన్. 58

సీ. సైకపుజరబాజుచందువా నొదవిన మేలిముత్యాలజాలీలు ప్రేల
గొనబైనబంగారుగోడల నంటిననిలువుటద్దంపుగుంపులు వెలుంగ
బలుమానికపుఁగంబములఁ గదియించినకాంచనపాంచాలికలు నటింపఁ
బెలిముత్తియంపుఁబందిరు లమర్చినపుంచిగందపుఁబట్టెకంకటులు మెఱయఁ

తే. బరిమళద్రవ్యములు నించి వరుస నిడిన, చంద్రకాంతపుగిండులు జానుమీఱ
నడపములు జాలవల్లిక లాదిరైన, విమలశృంగారవస్తుజాలములు నమర. 59

తే. కొలఁది మీఱినచిత్రలీలలఁ జెలంగి, యనుపమం బగునిద్దపుటట్టలోనఁ
బసిఁడిగొలుసులపసల నింపెసఁగుచున్న, మానికపుఁదూఁగుటుయ్యాలపైని గదిసి.

సీ. కనకకంకణఝణత్కారం బలర నొక్కపదహంసయాన చామరము విసర
మణిమయముద్రికాఘృణులు పర్వఁగ నొక్కమానిని తెలియాకుమడుపు లొసఁగ
నురుపయోధరకుంభయుగళి యుబ్బఁగ నొక్కపణఁతుక రత్నవిపంచి మీటఁ
జరణమంజీరనిస్వనము లొప్పఁగ నొక్కసరసిజేక్షణ బరాబరి లొనర్పఁ

తే. గంబుకంఠి యొకర్తు గానంబు సేయ, భామ యొక్కతె బలుదమ్మపడిగఁ బూనఁ
జంపకామోద యొకర్తు నిద్దంపుఁజికిలి, నిలువుటద్దంబు ముందర నిలిపి చూప. 61

తే. తరుణు లిరువురు భోజసుతాస్వరూప, లిఖితనవచిత్రఫలకముల్ వేడ్కఁ బూని
యిరుగడల నిల్చి కొలువ నహీనవిభవ, జితపురందరుఁ డనఁదగి యతులగతిని. 62

సీ. విరిసరుల్ సుట్టి వావిరి నొయ్యారము మీఱ నొరగ వైచినసికయొఱపు చూప
నాలెవా టొనర్చినజిలుఁగుబంగరుడాలు తగటుదుప్పటి వింతసొగసు లీనఁ
దీరుగాఁ గొనగోట దిద్దిననిడుదకస్తురిరేక నొసలఁ గాంతులఁ జెలంగ
మెదిపి గొజ్జఁగినీటఁ బదనిడ్డనిద్దంపుఁగలపంపుమైపూఁత వలపు గులుక
తే. గొప్పముత్యాలచౌకట్లు కొమరుదేర, బవిరిగడ్డంపుజిగితోడఁ బవిలి మెఱయ
హారకేయూరకంకణాద్యమితభూష, ణాంచితవిలాసుఁ డగుశౌరిఁ గాంచి యపుడు.
సీ. జయజయ కమలాక్ష సకలలోకాధ్యక్ష జయజయ నవనీతచౌర్యధుర్య
జయజయ గోవింద సాధితాహితబృంద జయజయ సంతతసదయహృదయ
జయజయ వనమాలి సారయశశ్శాలి జయజయ బుధనుతిజాలలోల
జయజయ వైకుంఠ సమరజయాకుంఠ జయజయ పుండ్రేక్షుచాపరూప
తే. జయ నిరంతరవల్లవీజనకుచాగ్ర, రచితరుచితరపరిమళప్రచురగంధ
సారసారంగమదఘనసారసాంక, వాంకితోరస్స్థలానంద హరి ముకుంద. 64
తే. అనుచుఁ గైవార మొనరించి యవ్విరించి, కులశిరోమణి విలసితజలదవర్ణు
చెలువునకు మది నానందజలధిఁ దేలి, యొనర మఱియును దీవన లొసఁగుటయును.
క. ఆవిష్ణోత్తముఁ గన్గొని, గోవిందుఁడు భర్మడోల గొబ్బున డిగి సం
భావించి మ్రొక్కు లిడి యొక, పావనమణిపీఠి నునిచి భక్తి దలిర్పన్. 66
తే. సురలు దనుఁబూజ యొనరించుకరణి నతనిఁ, బూజగావించి కుశలంబు పొసఁగ నడిగి
వెసఁ బ్రసాదంబు వెట్టించి వీడె మొసఁగి, మృదులతల్పంబుపై నుంచి పదము లొత్తి.
చ. వినయవివేకము ల్వెలయ విప్రకుమారునిఁ జూచి వెన్నుఁ డి
ట్లను నవనీసురేంద్ర యనయంబును మీరు వసించుపెంకి యే
జనపదభూమి యం దతఁడు సాధుజనాదరణుండె యిప్పు డే
పని కిట కేఁగుదెంచితిరి భద్ర మగుం దెలియంగఁ జెప్పరే. 68
క. అనవుడు హరిఁ గనుఁగొని యో, దినకరనిభ విను విదర్భదేశంబునఁ గుం
డిననగరి యేలుభీష్మక, జననాయకుఁ డొప్పు సకలజనసమ్మతుఁడై. 69
తే. అతనిపుత్త్రిక రుక్మిణి యనఁగఁ బరఁగు, కన్యకామణి గల దయ్యగణ్యపుణ్య
శీల నీకును బరిచర్య సేయఁగోరి, యొక్కశుభవార్త పుత్తెంచె నొనర వినుము. 70
క. మునివల్లభ దుర్లభమై, తన రెడుభవదీయచరణతామరసయుగం
బనిశము సేవింపఁగఁ గోరినదానఁ జెలంగి నన్నుఁ గృపఁ జూడు హరీ. 71
ఉ. కన్నియ కీక్రియం బలుకఁగాఁ దగ దంచుఁ దలంచెదేనియున్
మున్ను వరింపదే భువనమోహన యిందిర సుందరీజనుల్
చెన్నగునీవిలాసకులశీలబలామితరూపసంపదల్
కన్నులఁ గన్న విన్నఁ దమకంబునఁ గోరుట ధాత్రిఁ జిత్రమే. 72

చ. నిరతము తావకాంఘ్రియుగనీరజభక్తిఁ జెలంగునన్ను నో
పురుషవరేణ్య రుక్మి యనుబుద్ధివిహీనుఁడు క్రొవ్వి చేదిభూ
వరుఁ డనుదోసకారికి వివాహము సేయఁ దలంచుచున్నవాఁ
డరయఁగ నక్కపోతునకు నబ్బునె బెబ్బులిసొమ్ము కింతయున్. 73

క. ఉడుగనియాసలఁ దమ నెఱ, య్యెడ నమ్మినసాధుజనుల నేఁచెడుఖలులన్
దొడరి వధింపక యూరక, విడువఁదగద యెందునైన వీరవరేణ్యుల్. 74

తే. తడయఁ బనిలేదు వేవేగఁ దరలి వచ్చి, కలన శిశుపాలమాగధాదుల జయించి
రాక్షసవివాహమునఁ బయోజాక్ష నన్నుఁ, గైకొనుము శౌర్య ముంకువగా నొనర్చి.

తే. రాజశుద్ధాంతసౌధాంతరమున మెలఁగు, నిన్ను నేత్రియఁ దేవచ్చు నిఖిలబాంధ
వుల వధింపక కాకని తలఁచెదేని, విను ముపాయంబు చెప్పెద వనజనయన. 76

క. కులదేవయాత్ర యొనరిచి, వలనుగఁ బురి వెడలి శివునివనితకు మ్రొక్కం
జెలఁగి తమవారు పంపుదు, రెలమిం బెండ్లికిని ముం దహీనచరిత్రా. 77

తే. అట్లు శివవల్లభకు మ్రొక్క నరుగుతఱిని, సరగఁ బఱతెంచి కొనిపొమ్ము కరుణఁ జేసి
కాక నీమది నశ్రద్ధగాఁ దలంచె, దేని నామీఁదిపని నాకె తెలియుఁ జుమ్ము. 78

మ. అని నీచెంగట విన్నవింపు మని యయ్యబ్జాస్య పుత్తెంచె నో
జననాథోత్తమ జాగు వల్దిఁకఁ జమూసంఘంబులం గూడి గొ
బ్బున వేంచేయుము కుండినేంద్రసుత నంభోజాతనేత్రం జగ
జ్జనసంస్తుత్యచరిత్రఁ గైకొనుటకున్ సంతోషచిత్తంబునన్. 79

క. ఆకాంతాజనరత్నము, నీకుఁ దగుం దగుదు వీవు నృపకన్యకకున్
మీ కిరువురకుం గూర్చిన, యాకమలజుపోడిజాడ లలవియె పొగడన్. 80

క. ఓచక్రధర నిజంబుగ, భూచక్రమునందుఁ గల్గుపొలఁతులు తులగా
రాచక్రస్తనితో మఱి, యాచక్రియుఁ బొగడఁ జాలఁ డబలగుణంబుల్. 81

క. వన్నెలనెల వన్నెలఁదుక, వెన్నెలదొర కళ యనన్ భువిన్ విలసిల్లున్
కన్నులు విరిదమ్ములు చెలి, కన్నులు తుల యొందుఁ జెంద రంబుజనాభా. 82

క. కుందము లాదంతము లర, విందము లాపదము లుదధివిలసద్వీచీ
బృందము లావళు లలరు మిళిందము లాకుంతలములు లీలావతికిన్. 83

సీ. భృంగముల్ సింగముల్ తుంగగంగాసరద్భంగముల్ మత్తచక్రాంగములును
జిందముల్ కుందముల్ సుందరేందీవరబృందముల్ వికచారవిందములును
క్షీరముల్ కీరముల్ సారసౌరభ్యకల్హారముల్ ఘనఘనసారములును
వ్యాలముల్ శైలముల్ శ్రీల నోలాడుమృణాలముల్ చంపకజాలములును

తే. దుల యగునె దానికచమధ్యవళిసుయాన, గళరదననేత్రముఖహాసలలితవచన
కరపదస్కంధరోమాళిగురుకుచభుజ, నాసలను బోల్ప నింతైన నలిననయన. 84

తే. అబ్జబింబోపమానంబు లగుచు లోచ, నాధరంబులు వదనంబు నలరఁ జెలికి
కోకనదవిభ్రమంబు గైకొని యురోజ, నాభికలుఁ బదయుగ మొప్పు నలినముఖికి.

సీ. విశ్వంభరాకృతి వెసఁ బూనె జఘనంబు హరివిలాసస్ఫూర్తి నలరెఁ గౌను
కనకాంశుకఖ్యాతిఁ గర మొప్పె మెయిచాయ విధుమనోహరవృత్తి వెలసె మోము
శ్రీవరాకారంబుఁ జెందెఁ గర్ణయుగంబు కృష్ణశోభారూఢిఁ గేరెఁ దుఱుము
చక్రిలావణ్యంబు సరవిఁ గైకొనె నారు దరభవ్యకరలీలఁ దనరె గళము

తే. సరసిజాక్షికి సకలాంగసౌష్ఠవంబు, ప్రణుతి యొనరింప నీరీతిఁ బరఁగునపుడు
మానసంబునఁ దుది లేనిమమతమీఱఁ, గుధరధర నిన్ను వరియింపఁ గోరు టరుదె.

క. హరిణీనిభమణివిరచిత, హరిణీప్రభనయనవిజితహరిణీసభయా
స్ఫురినీలవేణిచెలువము, హరినీరజభవులకైన నలవియె పొగడన్. 87

సీ. అరుణాధరోష్ఠి యయ్యబలాశిరోమణి చంద్రబింబాస్య యాజలజగంధి
మంగళగాత్రి యామదనవైభవలక్ష్మి సౌమ్యభాషిణి యావిశాలనేత్ర
గురుకుచకుంభ యాపరభృతోజ్జ్వలకంఠి కవివర్ణనీయ యాఘననితంబ
మందగామిని యాసముంచితహరిమధ్య పటుతమోవేణి యాపల్లవాంఘ్రి

తే. రుచిరకేతుప్రకాశ యారుక్మవర్ణ, గావున నుదగ్రశుభసుఖకారణ మగు
ఫలము చేకూరు టరుదె చెల్వారదాని, యవిరళానుగ్రహ మొకింత దవిలెనేని.

తే. నదము పొక్కిలి మృదుకోకనదము పదము, దరము కంఠంబు నలినసుందరము కరము
సరము జఘనంబు నవవారిధరము తుఱుము, తరమె హరిమధ్యఁ బ్రణుతింపధరణినాథ.

ఉ. డంబుగదే పిఱుందు పగడంబుగదే జిగిమోవి చంద్రఖం
డంబుగదే కపోలము జడంబుగదే నడ మన్మథాగ్రకాం
డంబుగదే కటాక్షము గుడంబుగదే నుడి మేటితేఁటితం
డంబుగదే కచంబు నిబిడంబుగదే మెయికాంతి యింతికిన్. 90

సీ. కనకాంగిముద్దుమోమంబు పద్మము సేయుఁ గలకంఠిగళము శంఖంబు సేయుఁ
గామినీమణిజిల్గుఁగొ ననంతము సేయుఁ గొమ్మకన్బొమదోయి కోటి సేయుఁ
జపలలోచనవిలాసం బచింత్యము సేయు శుకవాణికటి మహాక్షోణి సేయు
మధురోష్ఠినాభి నిమ్నతసాగరము సేయుఁ బూఁబోణిమేచాయ భూరి సేయు

తే. నామధేయంబు రుక్మిణి నాఁగఁ బరఁగుఁ, గావున నధీశ వేనోళ్లు గల్గినట్టి
యహికులాధీశ్వరున కైన నలవి గాదు, చెలువచెలువంబు గణుతించి విలువసేయ.

క. బింబోష్ఠికురులు హరినీ, లంబుల మదపుష్పలిట్కులంబుల ఘనజా
లంబులఁ జమరీమృగవా, లంబులడం బలరు శైవలంబులఁ గేరున్. 92

మ. జలజాతావళి నేఁచుదుష్కృతముచేఁ జాలం గళాహీనుఁడై
తలరన్ జంద్రుఁ డటంచు లోకు లెపుడుం దన్నాడ రోషించి వె

న్నెలతోఁ డాచెలివక్త్రమై వెలసి పూన్కిం దాని నేత్రాంబుజం
బులు కాంతిన్ విలసిల్ల సంతతకళాపూర్ణుండు గాఁబోలు న్సుమీ. 93

క. గణుతింపఁగ మధుపానపు, గుణ మెక్కుచు దిగుచు నుండు కుసుమాస్త్రునిసిం
గిణివిండ్లు దగునె తరుణీ, మణికన్బొమలకు భువిన్ సమం బొనరింపన్. 94

మ. క్షయయుక్తోడితుఁడున్ గళంకియు ఘనస్వర్భానుదంష్ట్రాక్షత
ప్రయుతాభీలవిషానలుండు శశి చెప్పన్ రోఁత తచ్చంద్రికల్
ప్రియ మెట్లుంచుఁ జకోరముల్ మిగులు కోర్కిన్ హాసచంద్రాతపో
చ్ఛ్రియభామాముఖకైరవాప్తుని భజించం బోలు నేత్రంబులై. 95

చ. తిమురదళాక్షి నాస నవగంధఫలిన్ విరియించుమించుట
ద్ద్రుములఁ గరంబు సోఁకుటనె తద్దయు మాయఁగఁ జేయుఁ జెక్కులా
రమణిశ్రుతిద్వయంబు తలరన్ నవసంఖ్యల నెన్ను నన్మద
శ్రీమదశిరోజముద్దునునుఁబల్కులు సారెకుఁ గేరుఁ జిల్కలన్. 96

సీ. జలజాక్షి పెదవితో సాటి నొందక యేమొ నెతిబింబఫలము మాధురినిఁ బాసెఁ
బికవాణి యధరంబునకు నీడు గాకేమొ విద్రుమంబు క్రయింప విలువఁదేరఁ
జెలువవాతెఱతోడఁ దులరాఁ గలుగకేమొ పద్మరాగము శిలాప్రాయ మయ్యెఁ
బాలికాదచ్ఛదంబునకు నోడుట నేమొ బంధుజీవకము నిర్గంధ మయ్యె
తే. వినుతమాధుర్యయుక్తమై విలువ దెగక, దృఢశిలాప్రాయమును గాక దివ్యగంధ
బంధురంబయి సురుచిరప్రభల నమరు, దానికెమ్మోవి మరునిపూఁదేనెబావి. 97

క. కలువరుస మొల్లమొగ్గల, బలువరుసల గేల్వఁజాలుఁ బైదలిలేన
వ్వులు పున్నమవెన్నెలలన్, వెలిగా నొనరించు నెప్పుడు విశ్వాధీశా. 98

తే. చెలువకంధరక్రముకంబుఁ బలువిధముల, వ్రక్కలుగఁ జేయుదక్షిణావర్తశంఖ
మింతికంఠంబునకు నోడియేమొ భీతిఁ, గళవళంబున మొఱ సేయఁగాఁ బొడంగె.

క. రతిమనసిజకేళీవన, సతతవిరాజితరసాలశాఖాయుగ మ
య్యతివభుజయుగము తుదలన్, వితతంబుగఁ బల్లవములు వెలఁదుకపాణుల్. 100

సీ. చంద్రయోగమునకుఁ జాలఁ దల్లడమంది కవ వీడి పాలుఁ జక్కవలు తుదయె
తలరుహిమాంబుధారలు సోఁకి పస దప్పి మెఱఁగురాజీవకుట్మలము లీడె
విమలవజ్రప్రహారముల కెంతయు నెదం దలఁకెడుగిరిశృంగములు సమంబె
కరముసొంపగు భద్రగంధవహోద్ధతిఁ జలియించుదాడిమఫలము లెనయె
తే. వన్నెగాఁ జంద్రహిమజలవజ్రహార, భద్రగంధవహోద్ధతిఁ బరఁగుచుండి
కదిసి పస గల్గి తలఁకక కదల కెపుడుఁ, జెన్ను మీఱెడు చెలిగుబ్బచన్నులకును.

చ. వెలయఁగ నాభికాబిలము వెల్వడి సిబ్బెపుగబ్బిగుబ్బలన్
మలయమహీధరాగ్రముల మాటున నీటున నిల్చి వాసనల్.

గలవలియూర్పుఁ జెమ్మెరలు గైకొనులీల బిలేశయంబనం
జిలుకలకొల్కి యారువిలసిల్లుమనోహరకాంతిపై ఖరిన్. 102

చ. అనుపమనీలలాలితనిజాలకజాలకజిల్గుఁ గొనుతో
సెనఁ గనఁ గోరి చేరి కడునిచ్చలు నిచ్చలుమీఱఁ బోరి య
య్యనువున నోడి భీతి మది నానఁగ నానఁ గలంగి కాన కేఁ
గెను హరి యట్లు గానియెడఁ గేసరికేసరియొప్పు గావలెన్. 103

క. వళు లలరుసుత్తదంతా, వళికుంభస్తనయుగళికి వనధితరంగా
వళులఁ జలనంబు గలతను, నిలువెల్లన్ విష మటంచు నిందించి కడున్. 104

తే. తరుణియూరుద్వయంబుతోఁ గరికరములు, వాద మొనరింపఁజాలక వంగిపోయె
కపులగర్భంబు లింతిజంఘలకు నోడి, వేగఁ దృణమూని లవలించె వెన్ను చూపి.

తే. కమలపత్త్రాక్ష శంఖచక్రములు నీకుఁ, గరములందుండుగాని యాతరుణి కెపుడు
నలరుచుండును పదములం దరసి చూడ, సకలశుభలక్షణాంగి యాచంద్రవదన.

శా. ఆకాంతామణి యాబుధద్విరదకుంభాంచన్మహోరోజ యా
రాకాచంద్రనిభాస్య యారమణి యారాజీవపత్త్రాక్షి యా
శ్రీకారోపమకర్ణ యాచెలువ యాశృంగారవారాశి యా
లోకస్తుత్యచరిత్ర నీకుఁ దగుఁ బల్కుల్ వేయు నింకేటికిన్. 107

చ. అనుటయు శౌరి సంతసిలి యో నవనీసురవర్య తథ్య మీ
వనిన తెఱంగు భీష్మకధరాధిపపుత్త్రివయోవిలాసముల్
మును విని డెంద మాభువనమోహనవిగ్రహపైనె యుంచి యే
పనులయెడం దలంతు దృఢభక్తుఁడు నన్నుఁ దలంచుకైవడిన్. 108

ఉ. కన్నియరూపవైభవము కన్నులఁ గట్టినయట్ల యుండు వి
ద్వన్నుత రుక్మి సేయునహితక్రియ లన్నియు మున్నె విందు నిం
కెన్నియు నేల భీష్మకనరేంద్రునిప్రోలికి వచ్చి వైరులన్
ఖిన్నులఁ జేసి పోఁ దఱిమి నీలకచన్ వరియింతుఁ గూరిమిన్. 109

సీ. ఆతటిల్లతదేహ మభినవలీలలఁ గదిసి యుండనిఘనాభ్యుదయ మేల
యాచకోరకనేత్రతో చెల్మి యొదవనిచెలువంబు లసురాచచిన్నె లేల
యాపయోధగవేణిదాపున మెలఁగనినిత్యమహీభృదౌన్నత్య మేల
యాసరోజానన యలగ భాసిల్లనిప్రచురంబు లగునినప్రభలవేల
తే. బాల నేవేళ నెద నిడి పరమహర్ష, జలధి నోలాడకుండెడుసకలరాజ్య
వైభవం బేల కరిహయవర్గ మేల, ధరణిసురవర్య యెన్నిచందముల నరయ. 110

క. అని పల్కి యాక్షణంబునఁ, దనుజకులారాతి దా విదర్భావనికిం

జన నుద్యోగం బొనరిచి, తనపంపున సూతుఁ డైనదారుకుఁ డెలమిన్. 111

తే. సైన్యసుగ్రీవమేఘపుష్పకవలాహ, కంబులను ఘోటకంబులఁ గట్టి గరుడ
కేతనం బెత్తి యాయుధవ్రాత మునిచి, తేరు వేవేగ సవరించి తెచ్చుటయును. 112

క. ద్విజరాజవంశచంద్రుఁడు, ద్విజకులచంద్రున కనర్ఘదివ్యాభరణ
ప్రజవసనాదులు కడు నిడి, విజయరథం బెక్కి చనియె విప్రుఁడు దానున్. 113

క. అని మునిజనులకు సూతుఁడు, వినిపించినరీతిఁ బ్రీతి వెలయఁ బరీక్షి
జ్జనపతికి శుకుఁడు చెప్పిన, విని పతి యటమీఁదికథయు వినఁ గోరుటయున్. 114

మ. శరదిందూపమదేహనిర్జితవిపక్షవ్యూహకైలాసభూ
ధరవిభ్రాజితగేహదీనజనసంత్రాణామితోత్సాహభా
స్వరగోవల్లభవాహపర్వతసుతాంచన్మోహపాపావళీ
శరదాభ్యస్తగంధవాహసుమనస్సంఘాతనిర్వాహకా. 115

క. శారదనీరదనారద, పారదఘనసారహారపాటీరసుధా
హీరధరాభవరస్మిత, సారదయాపూరదీనజనమందారా. 116

మాలిని. జలనిధివరతూణా సత్యవాక్యప్రమాణా
జలజనయనబాణా సంహృతాంభోజబాణా
సలలితగుణసీమా సారసంగ్రామభీమా
బలవదరివిరామా భక్తచిత్తాబ్జధామా. 117

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజన విధేయ తిమ్మనామధేయప్రణీతం బైనరుక్మిణీపరిణయం బనుశృంగారప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము.

---



కరతూణీకృతర
త్నాకరభీకరగజాంధకాసురదళనా
స్తోకపరాక్రమవిలస
ద్గోకర్ణవిభూషితాంగ కుక్కుటలింగా. 1

వ. అవధరింపుము సూతుండు మునిశ్రేష్ఠుల కెఱింగించిన తెఱంగున శుకుండు పరీక్షిన్మహీకాంతున కవ్వలికథావిధం బెఱింగింపం దొడంగె నట్లు కృష్ణుండు కుండిననగరాభిముఖుండై చనిచని. 2

ఉత్సాహ. ముదముతోడ నేకరాత్రమున విదర్భభూమికిన్
గదియ నేఁగ నత్తెఱంగు కామపాలుఁ డంతయున్
మది నెఱింగి వాహినీసమాజయుక్తుఁడై చనెన్
కదనభేరికల్ చెలంగఁ గంసవైరివెంబడిన్. 3

పంచచామరము. మురారియానతిన్ మదిం బ్రమోద మూని యంతటన్
ధరామరుండు రుక్మిణీనితంబినీమణీగృహాం
తరాళసీమఁ జేరి నిల్వఁ దన్ముఖానుమోద మా
నరాధినాథపుత్త్రి గాంచి నవ్వుమో మెలర్పఁగాన్. 4

ఉ. దిగ్గున లేచి విప్రకులధీమణికిం బ్రణమిల్లి జాళువా
నిగ్గులు దేఱుపీఠమున నిల్చి కరంబులు మోడ్చి యాత్మలో
నగ్గల మైనకోర్కె లలరారఁగ నిట్లను నోబుధేంద్ర యా
దిగ్గజరాజతుల్యుఁ డరుదెంచెనొ లేదొ వడిన్ వచింపుమా. 5

తే. అలకళానిధిరాక కుత్పలము లాస, నొందుక్రియను మదీయనేత్రోత్పలంబు
లోకళానిధి వినుము నీరాక కిప్పు, డెదురుచూచుచు నున్నవి ముదము మీఱ. 6

మ. రమణన్ విప్రుఁడు శౌరిపట్టణము చేరం గల్గెనో లేక మా
ర్గమునం జిక్కెనొ వెన్నుఁ డీపనికి నేరం బెన్ని రాఁడయ్యెనో
విమతశ్రేణితలంపు విస్తరిలునో వేంచేయునో యంచుఁ జి
త్తమునం గుందుచు నుంటి నింతదడవున్ ధాత్రీసురేంద్రోత్తమా. 7

క. ద్విజవర నీ వరిగినపని, గజిబిజియై చనెనొ నిన్నుఁ గన్గొని వికచాం
బుజనయనుఁ డాదరించెనొ, నిజసరణి యెఱుంగఁ బల్కు నెవ్వగ దీఱన్. 8

క. అని ఘన మగుచంచలబు, ద్ధిని నాపని విన్నదాఁకఁ దివిరెడుకన్యా
జనమణిఁ గన్గొని భూసుర, తనయుఁడు నగి పల్కె వినుము తగ నీయాజ్ఞన్. 9

సుగంధివృత్తము కామినీమణీమణిప్రకల్పితేందుశాలికా
స్తోమహేమధామదివ్యధూపధూమసౌరభో
ద్దామసామజాశ్వసంతతప్రకాశమైనయా
సోమవంశధాముప్రోలు చొచ్చి యందు నొక్కెడన్. 10

సీ. తళుకుఁజెక్కులఁదగద్దగలపై ముత్యాలచౌకట్లనిగనిగల్ చౌకలింపఁ
దెలిదమ్మిరేకులఁ దెగడుగన్దవలాలు మొలకనవ్వులకాంతిఁ గలసి మెలఁగఁ
బైనుమొగుల్ జిగిమించుతనుకాంతితో మేల్మిపసిఁడిదుప్పటిసిరుల్ బలసి మెఱయ
నలుతమించినమొల్లసరులసౌరభముచందనపుమేపూఁతవాసనల నెదుర

తే. నుదుటఁ గస్తూరిరేఖసొం పొదవి పొదల, దివ్యమణిభూషణద్యుతుల్ దిశలఁ బర్వ
భువనమోహనశృంగారపూర్ణుఁ డగుచు, నలరుమురవైరిఁ గన్గొంటిఁ గలువకంటి.

క. పున్నమచందురుఁ డనఁదగు, వెన్నుని నటఁ జూచి నీదువృత్తాంతం బా
పన్నగరిపుకేతనునకు, విన్నప మొనరింప హాసవికసితముఖుఁ డై. 12

క. నీసుగుణరూపయౌవన, భాసురసుకుమారతలకుఁ బలుమఱు మది ను
ల్లాసము నొంది ముకుందుఁడు, మీసంబులు దువ్వె రిపులమీఁదం దరుణీ. 13

తే. కనకభూషణమణిగణఘనవాంబ, రాదికము నా కొసంగి దా నపుడె కదలి
వాఁడె వేంచేసె రిపులఁ బోవంగఁ దఱిమి, నిన్ను వరియించు నిఁకఁ జూడు నీరజాక్షి.

క. వనితా నీభాగ్యవశం, బున నిపు డాచెలువుఁ డబ్బె భోగీశ్వరుఁడున్
వినుతింపఁ గలఁడె యాతని, ఘనతరసుకుమారరూపకాంతిప్రతిభల్. 15

తే వానియాకార మారమారవరకుమార, మారమాధవధవళాంశుమానితంబు
వానిసామ్రాజ్య మాస్వరావాసవాస, వాసవాంబరవాసగప్రహాసకంబు. 16

సీ. విరిదమ్మిరేకులసిరి మించుకనుదోయి నిండుఁజందురుఁ దేరు నెమ్మొగంబు
హరినీలముల నేలుతరమైన మెయిడాలు గజతుండరుచిరంబు భుజయుగంబు
మించుటద్దపునిద్ద మెంచులేఁజెక్కులు మేలుసంపఁగిమొగ్గఁ బోలునాస
మొల్లమొగ్గలకాంతిఁ దెల్లజేయురదాళికం బూపమానంబు కంఠతలము

తే. పటుకవాటంబుతో సాటిఁ బరఁగుఱొమ్ము, చిగురుటాకులసొంపెల్లఁ దెగడునడుగు
లహహ కృష్ణునిసౌందర్య మరిది పొగడ, నహికులాధ్యక్షునకుఁ బితామహునికైన.

ఉ. చెప్పెడిదేమి యావిభునిచెల్వము గాంచినఁ గిమ్మఁదేనియల్
చిప్పిలు ముద్దుఁబల్కులును జెన్నగ గానము విన్నయంతలో

ముప్పిరిగొన్న మోహపుసముద్రములోపల నీఁదుచుండి యా
యొప్పులకుప్ప లైనదివిజోత్తమకన్యకలుం గరంగరే. 18

తే. వేయిదెఱఁగుల నయ్యదువీరుచెలువు, పూని వినుతింప నేటికి వానిఁబోలి
యంబుజారాతి తా విధుఁ డనఁగఁ బరఁగె, నలవసంతుఁడు మాధవుఁ డనఁగఁ దనరె.

తే. అనినవిని యాత్మ నుప్పొంగి యవ్వరాంగి, పెన్నిధానంబుఁ గన్గొన్న పేదయట్లు
తనమనోరథ మీడేఱె నని తలంచి, విప్రకులశేఖరుని గారవించి పలికె. 20

మ. ధరణీదేవకుమార నీమహిమ చిత్రం బెన్న నిద్ధాత్రి నె
వ్వరికిం జెల్లు నమందయాన మొనరన్ ద్వారావతిం జేరి భా
స్వరలీలన్ మహిపావరోధము ప్రవేశంబై జగత్కారణున్
బరమాత్మున్ హరిఁ దోడితెచ్చితివి మద్భాగ్యాధిదైవంబవై. 21

క. కన్నియతలఁ పిది యెం తని, యెన్నక కారుణ్యదృష్టి నీక్షించి తగన్
వెన్నునిఁ దోడ్కొనితెచ్చిన, ని న్నేక్రియఁ బ్రస్తుతింప నేర్తు మహాత్మా. 22

క. ఆరయ నీఋణ మింతయుఁ, దీరుపఁ గా నేర వసుమతీసురవంశో
ద్ధారక యూరకయె నమస్కారముఁ గావింతు భక్తి గడలుకొనంగన్. 23

తే. అని నమస్కార మొనరించె నంత రామ, కృష్ణు లేతెంచి రని విని కేవలప్ర
మోదమునఁ దూర్యఘోషముల్ మొరయ భీష్మ,కుం డెదుర్కొనిపూజించికొల్చుకొలర.

చ. నగరికిఁ దోడితెచ్చు నెడ నవ్యకుతూహలహృత్సరోజలై
మగువలు తత్తఱించుచును మాధవుఁ గన్గొనఁగోరి చేరి కెం
జిగినునువాతెఱల్ గదలఁ జేతులు ద్రిప్పుచు నుండి రప్పు డా
సొగసులు చూచి డెందములఁ జొక్కుచు జాణలు మేలుమే లనన్. 25

చ. కలికి యొకర్తు కన్గవను గస్తురి దిద్ది లలాటపట్టికం
జెలువుగఁ గజ్జలం బిడి కుశేశయలోచనుఁ జూడ వచ్చె ను
గ్మలి మఱియొర్తు వేనలిని గంధము మెత్తి మిటారిగుబ్బలన్
గలయఁ బ్రసూనమాలికలు గట్టి హరిం గనఁ జేరెఁ జేరుచున్. 26

చ. పొలఁతుక యోర్తు నవ్యమణిభూషణముల్ ధరియించు చుండి యా
నలినదళాక్షుఁ గన్గొనఁ జనన్ వలె నంచును దత్తరంబుతో
గళమునఁ గాంచియున్ జిలుఁగుఁగొనునఁ దీఁగెయు వేణి నందియల్
వలయసమూహముల్ పదములన్ వెసఁ బెట్టుకవచ్చె నిచ్చలున్. 27

తే. వీడి జీరాడుపెన్నెఱుల్ గూడఁబట్టి, తత్తఱంబున హరిఁ జూడఁ దరుణి యోర్తు
సరగఁ బఱతెంచులా గొప్పెఁ జామరంబు, పూని శౌరికి విసరరాఁబోలు ననఁగ.

ఉ. కంచెల విప్పి యోర్తు తనగబ్బిచనుంగవపైని వాసనల్
మించుమృగీమదంబునఁ దమిన్ మకరీమయచిత్రపత్రముల్

కొంచక వ్రాయుచుండి యదుకుంజరుఁ గన్గొనఁ జేర షట్పదా
భ్యంచితపుష్పమంజరులు బాగుగఁ గానుక దెచ్చెనో యనన్. 29

ఉ. బంగరుతమ్మిమొగ్గ నొకభామయురంబున నించి వేడ్క ను
ప్పొంగుచుఁ గైరవాప్తకులభూషణుఁ గన్గొనఁ జేరెఁ జూడ ని
న్నుం గనుఁగొన్నయంతనె మనోభవుఁ డక్కున దమ్మితూపు లే
యంగఁ దొడంగె నంచు నసురారికిఁ జూపఁగ వచ్చుకైవడిన్. 30

సీ. మృగమదామోదముల్ జగతి నంతట నిండ గడగడ సైకపునడుము వడఁకఁ
బదములనందియల్ పలుదెఱంగుల మ్రోయఁ గనకకంకణములు ఘల్లనంగ
సుమమాలికలు కుచాగ్రములపై నర్తింప జడకటిసీమపైఁ జవుకళింపఁ
దాటంకదీధితుల్ తళుకుఁజెక్కులఁ గ్రమ్మ గరువంపునడకలు గడలుకొనఁగఁ,

తే. జిలుఁగుచెంగావిపావడ చిందులాడ, నెమ్మొగంబున నవ్వువెన్నెలలు పర్వ
నొకసరోజాతపత్త్రాక్షి యుల్లసిలుచుఁ, జేర వేవేగఁ జాణూరవైరిఁ జూడ. 31

ఉ. గొల్లమెఱుంగుఁబోండ్లు జిగిగుబ్బలఁ గ్రమ్మినతొమ్ముకం దిఁకం
దెల్లమిగాఁ గనంబడఁగ నేర దచించు వసించి యుత్తిఱిన్
హల్లకపాణి యోర్తు దనుజారియురంబున నించెఁ దావులన్
మొల్లము మీఱుచున్నగిరిమొల్లసరంబులు కౌతుకంబునన్. 32

తే. బిత్తరి యొకర్తు దోయిట ముత్తియంపు, సేసఁబ్రాలిడి యావృషభాసురారి
శిరముపై నించెఁ గోరిక చెంగలింప, రమణఁ దలఁబ్రాలు వోయుచందమున నపుడు.

చ. గొనకొని వీథివీథులను గుంపులు గూడి దరస్మితాంచితా
నన లగుచున్ నిరంతరకనత్కనకాభరణప్రసక్తనూ
తనమణిదీప్తిదీపికలఁ దద్దయుఁ దేటమిటారిచూపులన్
వనజదళాయతాక్షులు నివాళు లొసంగిరి కంసవైరికిన్. 34

సీ. కలికిరో యీతఁడే కులుకుఁబ్రాయపుగొల్లకన్నెల వలపించువన్నెలాఁడు
లలనరో యీతఁడే చెలఁగి నందవధూటిమ్రోల నాడెడుజగన్మోహనుండు
తరుణిరో యీతఁడే ద్వారకాపురమర్త్యకోటులకెల్లఁ దంగేటిజున్ను
తెఱవరో యీతఁడే దేవకీవసుదేవు లున్నతంబుగఁ గన్నపెన్నిధాన

తే. సుబల యీతఁడె బృందావనాంతరప్ర, చారభిల్లనితంబినీచారుదృక్చ
కోరరాకాసుధామయూఖుం డటంచు, నెంచి దీవించి సేసలు నించి రపుడు. 35

క. తను నీచెలువుఁడు భీష్మక, జగదీశ్వరసుతకు భోజజనపతిసుతయుం
దగు నితనికి నియ్యిరువురఁ, దగ గూర్చినఁ దమ్మిచూలి తా జాణగదా. 36

తే. అనుచుఁ బౌరాంగనలు చేరి యభినుతింప, నంత భీష్మకుఁ డాప్రలంబాంతకాబ్జ
నయనులను దోడుకొని తననగరు చేరి, వసనమణిభూషణాదులు వారి కొసఁగి. 37

క. క్షితిధరసుతఁ గొల్వఁగ సు, ప్రీతయై తగురుక్మిణీకురంగాక్షి నలం
కృతఁ జేయ నపుడె యానర, పతిపేరవారు లైనచెలులఁ బని గొలుపుటయున్. 38
క. వారును ధరణీవరక, న్యారత్నముఁ జేరి నిశ్చలానందమునన్
గేరుచు భువనోన్నతశృం, గారం బందఱు నొనర్పఁ గణఁగిరి వరుసన్. 39
ఉ. కౌను చలింప నిద్దపుమొగంబునఁ జెమ్మట ముంపఁ గంకణ
ధ్వానము లింపు నింపఁ గరతాళగతుల్ పచరింప హారముల్
పూని నటింప నూర్పు సొలపున్ వలితెమ్మెర లంకురింపఁగాఁ
జాన యొకర్తు రుక్మిణికి సంపఁగెనూనెఁ దలంటె నేర్పునన్. 40
తే. కస్తురియుఁ జందనంబును గలపి యొకతె, నలఁగువెట్టెను ధారుణీనాథసుతకుఁ
గప్పురము చిల్క సీకాయ గలిపి కాఁచి, నట్టిమృదువైన యటకలి పెట్టె నొకతె.
తే. జాళువాబిందియలను గొజ్జంగినీరు, నింతి జలకంబు లాడించి చంచలాక్షి
కురులు నొడలును దడి యొత్తి సరగ మణుఁగు, జీరఁ గట్టిరి కొంద ఱబ్జారిముఖులు.
తే. అగరుధూపంబు లిడె నొక్క చిగురుఁబోణి, నెఱులవేనలి యిడె నొకనీలవేణి
తళుకుటద్దంబు కెంగేలఁ దాల్చి యెదుట, నిలిచె నొయ్యారముగ నొకనలినపాణి.
సీ. నీలంపుగుంపుపై మేలిముత్తెము లున్నకరణి గొప్పున మొల్లవిరిసరంబు
లఱచందురునియందు నెఱిగందుపెలుఁగొందుతీరున నొసలఁ గస్తూరిరేఖ
తమ్మిఱేకులలోనఁ దుమ్మెదల్ నిల్చినగతిని వాల్గన్నులఁ గజ్జలంబు
వలిగట్టుబలుశృంగముల మంచు గప్పినజాడఁ జన్గుబ్బలఁ జందనంబుఁ
తే. బొందుపఱిచి సరత్నజాంబూనదాంఘ్రి, కటకకంకణకింకిణీకాంచికాంగ
దాంగుళీయకతాటంకహారనూపు, రాద్యలంకారములఁ గన్య నలరఁ జేసి. 44
క. నరనాథున కెఱిఁగించినఁ, బరితోషము నొంది యిపుడె బాలామణి నీ
శ్వరికిన్ మ్రొక్కఁగఁ దోడ్కొని, యరుగుడు వేవేగ నంచు నానతి యిడినన్.
సీ. లతకూన యొకర్తు మొల్లముగఁ గ్రొన్ననలు నబ్జానన యొకర్తు హిమాంబువులును
రంభోరు వొకతె సారపుఁగప్పురంబును శైలస్తని యొకర్తు చందనంబు
మృగనేత్ర యొకర్తు చెల్వగుకమ్మకస్తురిఁ బుష్పలిట్కచ యొకర్తు పూవుఁదేనెఁ
గొమ్మ యొక్కతె ముద్దుగుల్కుఫలంబులు ఫణిరోమలత యొకర్తు మణిగణంబు
తే. లెలమిఁ గొని రాఁగ దూర్యము ల్చెలఁగి మ్రోయ, భద్రగీతములుడుగక పాడుకొనుచు
విప్రకామిను లరుదేర వీరభటులు, బలసి కొల్వ నుదగ్రవైభవముతోడ. 46
క. బాలారత్నము శివుని, ల్లాలిగృహంబునకు నరిగి యం దయ్యుమకున్
గేలెత్తి మ్రొక్కి యెంతయుఁ, దాలిమి మదిలోన నిల్పి తరలనిభక్తిన్. 47
తే. గంధపుష్పాక్షతాంబరకనకభూషు, ణోపహారఫలానేకధూపదీప
కలితకర్పూరవీటికాదులను బూజ, లొనరఁ గావించి యిట్లని వినుతి చేసె. 48

సీ. జయజయ జగదంబ సరసగుణాలంబ జయజయ శుభమూర్తి సారకీర్తి
జయజయ కల్యాణి సమదకోకిలవాణి జయజయ మృదుగాత్రి శైలపుత్రి
జయజయ హరిణాక్షి సకలసత్కృతిసాక్షి జయజయ మునిలోల సాధుశీల
జయజయ కౌమారి శమితామితేంద్రారి జయజయ గుహమాత సతతపూత
తే. జయ పదాంభోజ సంసక్తచంచరీక, నికరశంకాకరామరానీకనిటల
ఘటితపటుతరకస్తూరికానవీన, సౌరభోరుప్రభాశ్రేణి జయ భవాని. 49
శా. అక్షీణప్రతిభావిభాసితబుధేంద్రానందసంధాయినీ
సాక్షాద్భద్రకరీ దయామయధురీ సౌందర్యపాథోనిధీ
కుక్షిప్రోల్లసదబ్జజాండసమితీ ఘోరాహవార్వద్విష
ద్రక్షశ్శౌర్యవిదారిణీ మముఁ గృపన్ రక్షింపు దాక్షాయణీ. 50
చ. కరతలకీరడింభవినిఖండితశుంభనిశుంభసంభృతాం
బురుహభవాండకుంభపరిముక్తమహాసురదంభజంభజి
ద్వరకరికుంభకుంభదనవద్య పయోధరకుంభసంతత
స్ఫురదురుశాతకుంభమణిభూషణజాలవిజృంభశాంభవీ. 51
చ. నిరుపమభక్తియుక్తులను నిత్యముఁ జిత్తమునందు ముందు నీ
చరణము లాశ్రయించుటకుఁ జక్రధరున్ వరుఁ జేయు మమ్మ నిన్
శరణని నమ్మి యెప్పుడు నచంచలవృత్తిఁ జెలంగువారికిన్
జిరతరమై యభీష్టఫలసిద్ధి యగుం గద సర్వమంగళా. 52
క. అమ్మా శంభునిమోహపుఁ, గొమ్మా బంగారుబొమ్మ కోర్కులు దయతో
నిమ్మా నిన్నే నమ్మితిఁ, జుమ్మా యర్చనలు గూరుచుటఁ గైకొమ్మా. 53
తే. అనుచు నుతిచేసి విప్రకామినుల కపుడు, గంధమాల్యాభరణవస్త్రకంఠసూత్ర
వీటికేక్షుఫలాదులు వెస నొసంగి, యవనిపతిపుత్రి యంబాగృహంబు వెడలి. 54
సీ. జలదమధ్యంబున వెలువడి చెలువులనఱలెడు క్రొక్కారు మెఱుఁ గనంగఁ
దారాపథంబునఁ దరలి యుర్వికి డిగ్గి విలసిల్లునవచంద్రకళ యనంగఁ
గణఁగి ముజ్జగము లొక్కట గెల్వఁ బూనినరతిరాజుమోహనాస్త్రం బనంగ
నజుఁడు లోకులకెల్ల నాసఁ గొల్పనొనర్పఁ బొదలెడుపసిఁడికీల్బొమ్మ యనఁగఁ
తే. పుడమి ఱేఁడులమానసాంబుజవనములు, గలఁపఁ బఱతెంచువలఱేనిగంధకరి య
నంగ నంగన లెలమిఁ గొల్వంగ వేత్రి, పాణు లిరువంకలను బరాబరులు సేయ. 55
సీ. తాటంకరుచులు నిద్దపుఁ జెక్కులను బర్వఁ జికురముల్ మొగమునఁ జిందులాడ
గిలుకుటందియగముల్ ఘులుఘుల్లు రని మ్రోయ దరహాసచంద్రికల్ సిరులఁ బ్రబల
ఘనపయోధరభారమునఁ గౌను నటియింప ఘనసారవాసనల్ గ్రమ్ముకొనఁగ
మణిభూషణద్యుతు ల్మహి యెల్ల మెఱయింపఁ జూఱుకుఁ జూపులు వింతసొగసుఁ జూప

తే. నధరబింబారుణప్రభ లమలరదన, కుందతతులకు రాగంబుఁ గూర్ప నుచిర
కనకకంకణఝుణఝుణత్కారనినద, ములు జనంబుల కానందముగఁ జెలంగ. 56

చ. సురటి యొకర్తు వీవ నొకసుందరి యాకుమడుంగు లియ్య బం
భరనిభవేణి యోర్తు నునుఁబయ్యెదఁ జక్కఁగ దిద్ద బింబికా
ధర మఱి యోర్తు చేరి కయిదండ యొసంగఁ బొసంగ నన్నరే
శ్వరసుత యేఁగుదేర నరుసం గని యబ్బురపాటు మీఱఁగన్. 57

తే. శంబరారాతి కుసుమకదంబకములు, హృదయురంబులు గాఁడంగఁ దవిలి యేయ
రాజసుతులెల్ల నస్త్రశస్త్రమ్ము లుడిగి, చోద్యపడి ఱెప్పవేయక చూచు చుండి. 58

క. బళిరా ఘనధమ్మిల్లం, బళిరా చెలిరదనపఙ్క్తి యభినవముక్తా
వళిరా యివ్వీచీనిభ, వళిరాణిగఁ గల్గుమహిమ వశమా పొగడన్. 59

ఉ. ఖంబు గదే కవున్ శ్రుతిసుఖంబు గదే సుడి షట్పదీమయూ
ఖంబు గదే కచంబు విశిఖంబు గదే నిడువాలుఁజూపు శం
ఖంబు గదే గళంబు ప్రముఖంబు గదే జిగి నిర్జితాబ్జశం
ఖంబు గదే ముఖం బభిముఖంబు గదే తరుణత్వ మింతికిన్. 60

క. తరుణీమణిచన్గవకున్, బురు డొనరుప నించుకైనఁ బోలునె సుమముం
జరులన్ గిరులన్ దిర మగు, సిరులన్ దనరారుపసిఁడిచెండ్లన్ గిండ్లన్. 61

సీ. విరళమై తనుఁ దానె వీడి పాఱకయున్న ధరఁ గళాహీనతఁ బరగకున్న
మిత్రుఁ గన్గొన నోర్వమిని ముణుంగకయున్నఁ గారెక్కి దళములు గాకయున్నఁ
బ్రియకరస్పర్శచేఁ బెల్లు విప్పకయున్నఁ బలుమాఱు భంగత నలరకున్నఁ
బొరిఁబొరి జిగి దప్పి పొరలు డుల్లకయున్నఁ గడునూఁచకోఁతలఁ బడకయున్న

తే. ఘనశశికుముదకిసలయకమలముకుళ, భంగరంభాకలమగర్భపఙ్క్తిసాటి
కెక్కు నియ్యింతివేణి ముఖేక్షణాధ, రోష్ఠకుచవళిసక్థి జంఘోపమకును. 62

సీ. అరవిందశరకుందదరబృందములమాఱు మదవతీముఖనేత్రరదగళములు
హరిడింభకరికుంభగిరిరంభలను గేరు సతిమధ్యకుచకటీసక్థికములు
నదకోకనదశోకమదపైకములమీఱు సుదతినాభిపదోక్తిసుస్వరములు
ఫణిసోమమణిహేమఘృణిచామరములతీ రతినరోమలతాస్మితాంగకచము

తే. లహహ యిక్కన్యకామణి యఖిలభువన, మోహనాకారరేఖాసమున్నతముగఁ
దనరుచున్నది దీని నుద్వాహ మగుట, కన్న నిఁక నెన్న వేఱె భాగ్యంబు గలదె.

తే. అనుచు నృపులెల్ల విభ్రాంతి యలరఁ జూచు, చుండి రయ్యెడ భోజభూమండలేంద్ర
తనయ క్రేఁగంటిచూపుల ధరణివరుల, వరుస నందఱఁ గనుఁగొంచు నరిగి యరిగి. 64

సీ. సజలనీరదనిభశ్యామదేహమువాని హరినీలముల నేలుకురులవానిఁ
దెలిదమ్మిఱేకునఁ దెగడుకన్నులవాని డంబైనబవరిగడ్డంబువాని

మిసమిసలీనెడుమించి మెఱుఁగుఁ జెక్కులవాని నగవుదేఱెడిముద్దుమొగమువానిఁ
బొడవులై కనఁబడుభుజదండములవాని బలుపుమీఱెడుగొప్పయురమువానిఁ
తే. దలిరుటాకులఁ బోలుపాదములవాని, సిరుల కిరవగు కాంచనాంబరమువాని
నతులమణిభూషణాంచితుఁ డైనవాని, సారశృంగారుఁ డగువాని శౌరిఁ గాంచి.
ఉ. సంతస మంది యానృపతిచంద్రునితోడ జయంతుఁడు న్నిశా
కాంతుఁడు నవ్వసంతుఁడును గంతుఁడు నింతయు సాటి యౌదురే
వింతలుగాను ముం దితనివేసము దివ్యవిలాసముల్ సుధీ
మంతులు చెప్పఁగా విననమాత్రము నిక్కువ మయ్యె నియ్యెడన్. 66
ఉ. అద్దిర రాకమామమొగ మందము పున్నమచందమామతో
నుద్దియగుం గురుల్ సురవరోపలకాంతిఁ దృణీకరించు లే
నిద్దపుముద్దుఁజెక్కులు వినిర్మలదర్పణదర్పలీలలం
దద్దయుఁ గేరుమీఱు మృదుదంతమరీచులు మొల్లమొగ్గలన్. 67
క. నునుమేనుడాలు తొలుకరి, పెనుమబ్బులఁ దఱుమఁజాలు బింబము పగడం
బును దలిరుటాకునధరం, బున కెనయన నించుకైనఁ బోలునె తలఁపన్. 68
తే. తమ్మిరేకులఁ దెగడు నేత్రములవాఁడు, ఇమ్ముమీఱు వెడందయురమ్మువాఁడు
చండవేదండతుండాభచారుబాహు, దండములవాఁడు బళిర యీధరణివిభుఁడు.
ఉ. ఈరుచిరాస్యుఁ డీసరసుఁ డీవిభుఁ డీనవమోహనాంగుఁ డీ
సారవిలాసుఁ డీవికచసారసపత్రవిశాలనేత్రుఁ డీ
ధీరవరేణ్యుఁ డెప్పుడు మదిన్ గలకోరికలెల్లఁ గూర్చుచున్
గూరిమితో వరించుఁ దొలునోములపుణ్యఫలాతిరేకతోన్నతిన్. 70
క. అని వనజదళాయతలోచన దన డెందమున మిగుల సంతోషరసాం
బునిధిం దేలుచు నొయ్యన, దనుజకులారాతికడకుఁ దఱియం జేరన్. 71
క. అంబుజనయనుఁడు నపుడా, బింబాధర చెలువుఁ జూచి ప్రేమ దలిర్పన్
జంబుకముల నడిమిటిభాగంబు వడిం గొనెడుమత్తగజరిపుమాడ్కిన్. 72
తే. మహికి లంఘించి రాజకుమారిఁ దెచ్చి, రథముమీఁదట నిడుకొని ప్రధనవిజయుఁ
డగుచు శంఖంబు పూరించి యరులు చూడ, బలిమిఁ దనపట్టణపుఁద్రోవ పట్టె చనియె.
ఉ. అత్తిరి మాగధాదులు మురారిజయంబు సహింపలేక యు
న్మత్తకరీంద్రముల్ హరిని మార్కొనుచందము దోఁప నందఱున్
మొత్తములై హయద్విపచమూరథకోటులఁ గూడి యెంతయున్
దత్తఱ మొంది నందసుతుఁ దాఁకిరి రాకను డాక సేయుచున్. 74
మ. భటవాహాభశతాంగఘట్టనలభూభాగంబు గంపింపఁ ద
త్పటుఘోషంబులదిక్తటంబులు చెవుడ్పాటొందఁ బెంధూళి యొ

క్కుట నంభోరుహబాంధవుం బొదివి లోకం బంతట న్నిండుఁ జీఁ
కటిఁ గావింప నిలింపసంఘములు శంకం జెంది వీక్షింపఁగన్. 75

క. దురదుర దురమున కేపు గ,దురఁ దరగేహములతో నెదు రదు రరుల నం
దఱఁ దఱియం గని శౌరో,దరి దఱియం జేరి కడు బెదరి హరి కనియెన్. 76

క. దేవా వీక్షింపుము రిపు, భూచరసైన్యములు గదసి పోరిఁ బోరి శితబా
ణావలు లేయఁగఁ జాఁగిరి, నీవిక్రమశక్తి యెఱుఁగ నేరక ఖలులై. 77

ఉ. నావుడు శౌరి సెమ్మొగమునం జిఱునవ్వు దలిర్పఁ బల్కె నో
శైవలకుంతలా మును నిశాతశిలీముఖపంక్తు లేయుచో
భావజుచేతివేదనకుఁ బల్మఱు లోఁగుదుఁ గాని యింక జ
న్యావలిలోన శత్రునివహంబకపంక్తికి లోఁగ నింతయున్. 78

సీ. చెలియ నీకుచకుంభములదండ నుండినఁ గరిఘటాదృతభీతి నెరయుటెట్లు
లలన నీమూపుదూఁపులగాఁపు గల్గఁగాఁ బరుషతూఁపులు మీఁదఁ బరఁగుటెట్లు
నాతి నీపరిరంభణపుజోడు గల్గఁగాఁ బ్రహరణంబులు మేనఁ బర్వుటెట్లు
రమణి నీవాక్సుధారసవృష్టి గురియఁగా ఖలులచే నాశంబు గల్గుటెట్లు
తే. కావున నితాంత మగుచును దావకాక్షి, నవకృపాలోకనం బింత దవిలెనేని
పరబలంబులఁ జీకాకుపఱిచి త్రుంతుఁ, జూడు నాబాహువిక్రమస్ఫురణ నేఁడు.

తే. అనుచు వచియించి యెంతయు నాగ్రహించి,రథము మరలించి యాహవప్రౌఢిమించి
పాంచజన్యంబు పూరించి పరిహసించి, శరతతుల నించి విమతుల మురువుడించె.

ఉ. అప్పుడు రామసాత్యకిగదాదియదూత్తము లెత్తి యార్చుచున్
నిప్పులురాలుబాణములు నించి విరోధినరాధినాథులం
గప్పి గజాశ్వయూథములఁ గాఁడఁగ నేసి వధించి నెత్తురుల్
గప్పిన నేలులై పొరల ఘోరరణం బొనరించి రుద్ధతిన్. 81

చ. మరలక దంతవక్త్రుఁడును మాగధసాల్వవిదూరకాదులున్
గొరకొరఁ బోరికి న్నడచి ఘోరపరాక్రమ మొప్ప సేనలం
బురికొనఁ జేసి డాసి యదుపుంగవసైన్యము మీఁదటం బోరిం
బోరిఁ గురియించి రొక్కటను భూరిశిలీముఖధార లుక్కునన్. 82

శా. భేరీకాహళభాంకృతుల్ సుఘటగంభీరార్భటుల్ సంతత
క్రూరానేకపబృంహితంబులు జవాశుద్రాశ్వహేషాధ్వనుల్
స్సారస్యందనబృందఘోషములు భాస్వచ్ఛింజినీరావముల్
ఘోరాయోధనభూమిఁ బుట్టె గగనక్షోణీస్థలుల్ నిండుచున్. 83

సీ. తురగముల్ తురగముల్ కరులును కరులును బ్రాసికుల్ ప్రాసికుల్ భటులు భటులు
రథికులు రథికులఁ బ్రథనకోవిదు లైనవిలుకాండ్రు విలుకాండ్రఁ జలము మెఱయఁ
గదిసి యొండొరులు దాఁకను బైకి నుఱుకుచుఁ బోనీకు పోనీకు పొడువు పొడువు
పట్టుము పట్టుము బంధింపు బంధింపు కొట్టు కొట్టు మటంచు కూఁక లిడుచు
తే. గదల మోఁదుచుఁ దూఁపులు గుదులుగాఁగ, గుప్పుచును ఖడ్గములనఱకుచును వాఁడి
బల్లెములఁ గ్రుమ్ముచును జగద్భయదముగను, బోరు చేసిరి నెత్తురుల్ పొరలిపాఱ.

లయగ్రాహి.

కూలెడురథంబులును వ్రాలెడుగజంబులును వ్రాలెడుహయంబులును వ్రీలెడుసిడంబుల్
వ్రేలెడుగుణంబులును వ్రేలెడుభుజంబులును నేలఁబొరలాడెడుకపాలరదహస్తాం
కాంఘ్రిమునిపంజాలకరవాలపదఘాంఘ్రిఘనజానుతనుతాలుఘుటికాదుల్
తేలుచును గోరికలఁ దేలెడుపిశాచఖగజాలములునుం గలిగి యాలమపు డొప్పెన్.
శా. తాలాంకుండు హలంబుఁ ద్రిప్పి మగధాధ్యక్షు న్వడి న్మోఁద ని
ర్మూలీభూతశతాంగసూతహయుఁడై రోషించి యవ్వీరుఁ డా
భీలాజిహ్మగసంహతుల్ బలునిపై బెట్టేసి తత్సేనలం
దోలం జాఁగినఁ గాంచి సాత్యకి పడిన్ దోస్సార మొప్పారఁగన్. 86
తే. విలుగుణధ్వని చేసి నిస్వనం రెసల్చి, వాఁడితూఁపులు పదుమూఁడు వానిపైనిఁ
జొనిపి మఱలించె సాల్వవసుంధరేశుఁ, డలుక నిగుడంగ నపుడు సాత్యకిని దాఁకె.
క. హరిసోదరుఁడును సాల్వుని, యరదము పొడిపొడి యొనర్చె నైదమ్ముల న
ద్ధరణీశుఁడు విరథుండై, ద్విరదముపై నెక్కి యనికి దీకొల్పె వడిన్. 88
చ. కదఁ బురికొల్పి సాళ్వమహికాంతుఁడు రాఁ గృతవర్మ యడ్డమై
శరవిసరంబు లేయుటయుఁ జంచలచిత్తుఁడు గాక యన్నరే
శ్వరుఁడు కఠోరతోమరము సాఁచి వడిం బొడువంగఁ బూనినం
దరలక వానియీఁకె నడిదంబునఁ ద్రుంచెను యాదవేంద్రుఁడున్. 89
క. గొదగొని శిశుపాలుం డొక, గదగొని యదరంట నార్చి గదునేసిన న
య్యాదుకులతిలకుఁడు నేర్పున, నది దనుఁ గాఁడంగనీక యాగ్రహ మొదవన్.
క. కంఠీరవంబు మిగుల న,కుంఠగతిం గరిని బట్టుకొను క్రియ విజయో
త్కంఠుఁ డయి వాని నొయ్యనఁ, గంఠము వట్టుకొని బిట్టు గాసిం బెట్టెన్. 91
ఉ. బంటుతనంబు మించి పశుపాలకులెల్ల నృపాలురై కడుం
గంటకమూని కన్నులును గానక రాజుల గెల్వఁ జూచి రా
తొంటితెఱంగు లన్నియును దూరము చేసెద నంచు నెంచుచున్
వింటఁ గరంబుఁ జేర్చి యదువీరులఁ దాఁకెను బౌంప్రకుం డొగిన్. 92

తే. వానితోనె విదూరకమానవేంద్రుఁ, డనికి మొనచేసి తరలెఁ గల్పాంతవేళ
రుద్రుఁడనఁదగి దోర్బలాఢ్యుఁ డగుచు, నపుడు హరిఁ జూచి పౌండ్రకాధిపుఁ డుపలి
తే. ఓరి గోపాల నీ వొకపేరుగల్గు, శూరుఁడవు బలె ధారుణీశుల నెదుర్పఁ [కె.
బూనెదవొ యెద్దు గ్రొవ్వి యేనుఁబోతుమీఁద, నంకెవేసిన తెఱఁగున శంకలేక.
ఉ. గొల్ల మెఱుంగుఁబోండ్లనునుగుబ్బలపోటులు గావు కేరనీ
బల్లెపువాండ్రపోట్లు ననబంతులవేటులు గావు వాఁడిశో
ఛిల్లుగదాప్రహారములు బిత్తరిచూపులు గావు తూఁపు లీ
ప్రల్లదమేల బాలనిడి ప్రాణము నిల్పక పొమ్ము గోపకా. 95
సీ. భువనంబులం దెందుఁ దవిలి వసించిన నీఁగి శైలము క్రింద డాఁగియున్న
నీచవృత్తిఁ గణంగి నేలలోఁ దూఱిన స్తంభభావంబునఁ దలకున్న
బలిభిక్షములకుఁ బొల్పడి చెయ్యి చాఁచిన మంచిబాఁపడ వంచు మానివైన
ఘోరకాంతారముల్ దూఱి చరించిన ధరణి నాఁగలి పూని తిరుగుచున్న
తే. నుఱక యొకవ్రానిలోపల నిఱికి యున్నఁ, గలికితనమునఁ బలుమాఱు మెలఁగుచున్న
వేయితెఱఁగుల నిన్నె భావించుచుందుఁ, గాక పోనిత్తునా మీఱి కంసవైరి. 96
చ. అని యదలించి నూఱు నిశితాంబకముల్ హరిమేన నించి రా
మునిపయి నిర్వదాఱు శరముల్ నిగిడించి పదేసి తూపు లా
య్యనఁ గృతవర్మసాత్యకిగదాదులమీఁదట నేసి యార్చె న
ట్లనె చెలరేఁగి యేసె శరలాఘవ మొప్ప విదూరకేంద్రుఁడున్. 97
క. ఈరీతి నేయఁ గనుఁగొని, సీరియు శౌరియును గోపవసింగము లన న
వ్వీరులపైఁ గదిసి శరా, సారముఁ గురియించి రరులసైన్యము దరఁకన్. 98
మ. బలభద్రుండు రథంబు డిగ్గి విలయప్రద్యోతమానానలో
జ్జ్వలఫాలాక్షుఁడుఁబోలె సీరముఁ గరాబ్జాతంబునం బూని యా
ఖలులం బైకొని మోఁది సైన్యముల వీఁగిం దోలి ఘోరాహవ
స్థలియం దెక్కుడఁ దానయై తఱిమె దోస్సారం బవార్యంబుగన్. 99
తే. అట్లు తఱిమిన నిలువలే కఖిలనృపులు, చైద్యుఁ దోడ్కొని తమవిభుసదనమునకు
నరిగి రయ్యెడ రుక్మి యాహరినిఁ దాఁకెఁ, దొడరి యనలంబుపైఁ బడుమిడుతగతిని.
చ. ఇటు లెదిరించి తూఁపుగమి లేయఁ బొడంగిన జూచి వెన్నుఁ డా
కుటిలుని చాపఖడ్గరథఘోటకసూతుల నుగ్గుచేసి హ్రా
త్పుటమునఁ గోప మూనియును ద్రుంపక వాని విరూపిఁ జేసి యా
స్పటిపురి త్రోవఁ బో ష్మనుచుఁ బంపెను రుక్మిణి మ్రొక్కి వేఁడుటన్. 101
ఉ. అంతట శంఖమూఁది తమి నగ్రజసోదరబంధుయుక్తుఁడై

సంతసమూని క్రమ్ముకొని సైన్యములెల్లను గొల్వ రుక్మిణీ
కాంతవినోదవైఖరులఁ గన్నులపండువుగాఁగఁ జూచుచున్
వింతయొయ్యారమొప్పఁగఁ బ్రవేశ మొనర్చెను ద్వారకాపురిన్. 102

సీ. పౌరులు చేరి శోభనలీలఁ గన్గొని యానందవార్ధి నోలాడుకొంచు
గంధపుష్పాంబరకనకభూషణరత్నవిసరముల్ కానుక లొసఁగుకొనుచు
భద్రతూర్యములు నభస్స్థలం బవియింప వందిమాగధులు చెల్వంది పొగడ
లాసకీజనులు విలాసరూఢి నటింప వారిజేక్షణలు నివాళు లొసఁగ

తే. నపుడు కృష్ణుఁడు నిజమందిరాంతరమున, కరిగి తనతల్లిదండ్రుల కఖిలబంధు
గురుపురోహితవిద్వత్ప్రవరులకెల్ల, జగ్గుగా మ్రొక్కె రుక్మిణీసహితుఁ డగుచు.

తే. వినయగతి మ్రొక్కి వారిదీవనలు గాంచి, యంత విధ్యుక్తసరణి నయ్యవనినాథ
తనయఁ బెండ్లాడి ఘనతరోత్సవముమీఱఁ, దనరుచోనొకశుభముహూర్తంబునందు.

ఉ. చెంగట రత్నపుత్త్రికలఁ జిత్రవిలాసములున్ వెలుంగ సా
రంగమదంబువాసనలు గ్రమ్మఁగ నిద్దపునిల్వుటద్దపున్
రంగులు చెంగలింపఁ గప్పురంపుదుమారము చింద నంద మా
బంగరుమేడలోన విరిపాన్పున శౌరి చెలంగు చుండఁగన్. 105

తే. ప్రౌఢచేడెలు గొంద అంభోజనయను, భోజకన్యకనుం గూర్పఁ బూని యపుడు
వెలఁదుక నలంకృతి యొనర్చి విభునిచెంత, కెలమిఁ దోడ్కొనియరుగు మనిట్టులనిరి.

క. పదమా నీ వీక్రియ మ్మదు, గద మానక ప్రాణవిభునిపజ్జకు నిపుడే
మదనాగయాన మదనా, మదనాహవకేలిఁ దేలుమా మణిరదనా. 107

సీ. ప్రియునియొద్దకు నీవె బిరబిర నరుగక కెలన నొక్కెడ నిల్వవలయుఁ జుమ్ము
చెలువుఁడు దమకించి చేపట్టి తిగిచినఁ బెనఁగుచు వెన్కకుఁ జనెదు సుమ్ము
పతి తననుఱువులపై వసింపు మటన్న నొదిఁగి కూర్చుండుట యొప్పుఁ జుమ్ము
విభుఁడును నపురంపువిడె మొసంగిన సిగ్గుపడక కైకొనుటయె పాడి సుమ్ము

తే. సరసుఁ డతనునికేలికి సంభ్రమించి, బిగియఁ గౌఁగిటఁ గదియించి చిగురుమోవి
యాని వలపూని యిక్కవలంటునపుడు, విసువక* మెలంగవలయుఁ జూపసిఁడిబొమ్మ.

చ. అని చెలు లుగ్గడింప దరహాసము మోమున నంకురింపఁగ
మ్మునఁ గలపంపువాసనలు ముంప నొడల్ పులకింప నూపుర
ధ్వనులు ముదంబు నింపఁ జెలువం బగుకొను నటింప నాన పై
కొని మరలింప డెందమునఁ గోర్కులు ముందరి కెచ్చరింపఁగన్. 109

క. పడకింటిలోని కరిగిన, పడఁతుకఁ గన్గొని నరాధిపతిమేను గను

---

* పా. మెలంగవలెఁ జుమ్ము పసిఁడిబొమ్మ.

రొప్పెడువ నెపు డెప్పు డంచును, గడు నువ్విళులూరుచుండెఁ గామిను లంతన్.

ఆ. వెలఁదిచేతివిడెము విభునకు నిప్పించి, విభునిచేతివిడెము వెలఁది కొసఁగఁ
జేసి కల్లపనులు చెప్పక యుండొరుల్, దూసి రింప్ల కాకు దూసినట్లు. 111

సీ. కొమ్మపొక్కిటిపొన్నక్రొన్నచప్పై నిల్చి గురుతరోరోజపుంజరులు ముసరి
బంధురాధరజపాప్రసవమార్దవ మెన్ని కమనీయరదనకుందముల నెలసి
లలితకపోలకలవలీదళము లెక్కి నయనోత్పలంబులపయిఁ జరించి
సుందరవదనారవిందంబుపై వ్రాలి వితతంబుగా దేహలతను గ్రమ్మి

తే. చికురమధుకరకులముఁ జెలిమిఁ గాంచి, యభినవానందలీలల నలరి యప్పుడు
నెమ్మదిఁ జెలంగె నెంతయు నమ్మురారి, చారువీక్షణమాలికాషట్పదములు. 112

తే. తరుణి హిమభానుమండలదర్శనమున, సగము వికసించుచున్నట్టితొగలకరణి
శౌరిముఖచంద్రబింబదర్శనమునందు, నలరె నఱసిగ్గుఁజూపు లాజలజముఖికి. 113

శా. ఆదామోదరభోజకన్య లటు లన్యోన్యావనాలోకనా
హ్లాదస్ఫూర్తిఁ జెలంగ నంగజుఁడు ప్రత్యాలీఢపాదస్థుఁడై
కోదండంబు గుణధ్వనుల్ నిగుడఁ జేకొద్దిన్ వడిం దీసి బల్
పూఁదూఁపుల్ పరఁగించె నిర్వ్యరపయిన్ బుంఖానుపుంఖంబుగన్. 114

ఉ. అత్తఱి రాజకన్యకయొయారముఁ గన్గొని శౌరి యెంతయుం
జిత్తము దత్తఱింపఁ దమిచేఁ జెయినట్టుక పూఁశెయ్య్య కా
బిత్తరిఁ దార్చి ముద్దుగొని బెట్టుగఁ గంచెల యూడ్చి గుబ్బలన్
మెత్తనిచందనం బలఁది మెప్పుగఁ గమ్మవిడెం బొసంగుచున్. 115

చ. పలుచనితేనియల్ చిలుకఁ బల్కవె చిల్కలకొల్కి లేఁతవె
న్నెలవలెఁ జిన్నినవ్వొలయ నెమ్మొగమెత్తిటు చూడు బోటి కో
ర్కులు వెలయంగ నీబిగువుగుబ్బ లురమ్మున నాని మన్మథా
నలపరితాప మార్పఁగదె నన్నఱసేయక కన్యకామణీ. 116

సీ. లలన నీవలుదగుబ్బలపై నిలువఁగోరి తమ్మిమొగ్గలు నిరంతరము నొసఁగి
తరలాక్షి నీసుధాధరము గ్రోలఁగఁ గోరి తియ్యనిజుంటీఁగ తేనె లొసఁగి
చెలువ నీలేఁతనవ్వులు గనుంగొనఁ గోరి రమణగర్పూరహారము లొసంగి
యెలనాఁగ నీముద్దుఁబలుకులు వినఁగోరి మధురవాక్యములఁ బల్మఱు నుతించి

తే. వంచనము లేక యిష్టదైవంబు నిట్లు, పూజ గావించినాఁడ నీపొందుఁ గోరి
జాగు సేయఁగఁ దగ దింకఁ జలము మాని, యతనుకేలిని నన్నేలు మబ్జవదన.

క. అని సరసోక్తులచే న, వ్వనితామణిఁ గరఁగఁజేసి వనజాస్త్రుఁడు గ
ప్పునఁ బైపైఁ బఱపెడునూ, తనకుసుమకదంబములకుఁ దాళక యలమిన్. 118

సీ. ముంగురుల్ దువ్వి కనుంగవ ముద్దాడి చెలువు తేఁజెక్కుటద్దములు నొక్కి
కెమ్మోవి యాని కౌఁగిటఁ గుచ్చి లోఁ ద్రిప్పి చక్కిలిగిలిగింతగాఁ గేలు నిమిరి
నవి జల్లన విచ్చి నెత్తి జఘనస్థలంబాడిగా నక్కవెన్ని యంటి
ఒగ్గఁబువ్వుంగిటఁ బెనఁచి నఖక్షతదంతక్షతాదులు తగ నొనర్చి
తే. మతియుఁ బంచాస్త్రశాస్త్రసమ్మతులనతుల, గతుల రతులఁ బెనంగి యాకంజముఖిని
రంజిలఁగఁ జేసి మిక్కిలి వసిమఁ దనరఁగ, నల శౌరి నవోఢాసమాగమమున. 119
సీ. వితతదంతక్షతావ్యాప్తసుధాధరయును మానితనిశ్వాసమారుతయును
శితనఖరాంకురాంకితకుచకుంభయు ఘర్మకణక్లిన్నగండతలయు
వదనాంబుజాతసంవ్యాప్తశిరోజయు ఘనతరసీత్కారగళరవయును
రణితమంజీరకంకణకింకిణీకయుఁ దళితహారలతాప్రకరయు
తే. గళదహీనమృగీమదకర్దమయును, సదమలానందపరవశసంహననయు
నగుచు నృపపుత్రి మిగుల సౌఖ్యం బొసంగె, సరసిజాక్షున కయ్యాదిసంగమమున.
ఉ. అంత రతాంతవేళ దనుజాంతకుఁ డాచెలి నంకపీఠికన్
సంతస మొప్ప నిల్పి నునుఁజన్నులఁ గందము మెత్తి క్రమ్మఱం
గుంతలజాలముల్ తుఱిమి కోక కటిన్ ఘటియించి సొమ్ములు
త్యంతమనోనురక్తి నిడి యాకమలాంగు లొసంగి నేర్పునన్. 121
తే. సురఁటి విసరుచుఁ బల్కులు సుదతితోడ, సరససల్లాపములఁ బ్రొద్దు జరప నిట్లు
ప్రతిదినంబును గాఢానురాగ మొదవఁ, దవిలి సంభోగలీలలఁ దనరుచుండి. 122
క. పిదపన్ రుక్మిణి మొదలగు, మదవారణయాన లష్టమహిషులును సొం
పొదవఁ బదియారువేలం, బుదకచ లగురాజసుతలు మురుకొని కొల్వన్. 123
తే. దుష్టజనుల వధించుచు శిష్టజనుల, కభిమతార్థంబు లొనఁగూర్చి యాదరమునఁ
బ్రోది సేయుచుఁ గృష్ణుఁడు బుధులు పొగడ, భూరిసామ్రాజ్యలీలలఁ గేరుచుండె.
క. ముదమున నీహరిసత్కథఁ, జదివిన వ్రాసినను విన్న జనులకు సతతా
భ్యుదయకరంబగు నొదవుం, దుది నమ్మధువైరిపదము దొరకుం దిరమై. 125
క. అని సూతుఁడు మునిజనులకు, వినిపించినరీతి శుకుఁడు వేడ్కఁ బరీక్షి
జ్జననాథున కెఱిఁగించినఁ, దనమది నవ్విభుని నెపుడుఁ దలఁచుచు నుండెన్. 126
క. ఈకృష్ణకథ ముదంబున, నీకరుణ నొనర్చినాఁడ నిఖిలేశ్వర నీ
వాకర్ణించి ప్రబంధముఁ, గైకొనుమా తప్పులెల్ల క్షమచేసి శివా. 127
ఉ. ఆరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులం
జేరగుమన్మథాబ్దమునఁ జేసితిఁ బ్రబంధ మొనర్చి యీ కృతుల్
చేరికతో సమర్పణము చేసితి నీకృతి యాతమిత్రను

త్రైకూటవనమిత్రతారకముగా భువిఁ జెల్వుగాంచ శంకరా. 128

క. తరుణారుణాంబుజోపమ, చరణాఘభయాపహరణసతతసంస్మృతిహారిణా
శరణాగతశరణాచిర, కరుణాశశిధరణ పీఠికాపురశరణా. 129

ఉ. భాసురమందహాసపరిపాలితదాసజగజ్జనావనా
భ్యాసనిరంకుశోన్మదనుజాజినవాసమనోవికాసకై
లాసనివాససంతతవిలాసనుమేరుశరాసవాసవా
బ్జాసనవాసుదేవవినుతాసముదివ్యయశోవిభాసితా. 130

మాలినీ. కలుషఘనసమీరా కామగర్వాపహారా, విలసితగుణసారా వేదమార్గప్రచారా
బలదహితమారా పన్నగాధీశహారా, వలయితమునివారా వంచితాశేషఘోరా.

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర బుధజనవిధేయ తిమ్మననామధేయ ప్రణీతం బైనరుక్మిణీపరిణయం బనుశృంగారరసప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము. | | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు... | | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనకావ్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో ముద్రితము | ... | 0 | 10 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో ముద్రించియున్నాము. | | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీచినసీతారామస్వామిశాస్త్రికృతము అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు | ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరలముద్రించియున్నారము... | | 8 | 3 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠిక విపులము | ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 2 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.